# కురాను సారము



హిందీ మూలము :

వినోబా

తెలుగు సేత :

శ్రీ ఉమ్మెత్తల కేశవరావు

ప్రకాశకులు :

గాంధి సాహిత్య ప్రచురణాలయము,

చిక్కడపల్లి, హైదరాబాదు-20

# ప్రకాశకుల నివేదన

గాంధీ సాహిత్య ప్రచురణాలయం తమ 95 వ ప్రచురణగా కురాన్‌సారాన్ని పాఠకలోకానికి సమర్పించ గలిగినందుకు సంతోషిస్తున్నాము ప్రపంచంలోని అన్ని ధర్మముల లక్ష్యము మానవుని ఉన్నత నైతిక దిశకు కొనిపోవుటయే అని గాంధీజీ విశ్వాసం. ప్రతి ధర్మము మానవాళికంతటికి వర్తించు సత్యమును కొంతయైనను ప్రవచించును. అట్టి సార్వజనీన, సార్వకాలీన ఉపదేశాలే మానవాళికి సర్వదా ఆచరణీయములు. కాలానుగుణ్యమైన మార్పులకు లోబడే ఉపదేశాలన్నీ తాత్కాలికమైనవే. ఈ యధార్థాన్ని తెలుసుకుంటే మతానికి మతానికి, ధర్మానికి. ధర్మానికి మధ్య వైషమ్యానికి అవకాశమే లేదు. ఈ దృష్టితోనే గాంధీజీ తన మతాన్ని నిర్వచించాడు. ఇదే లక్ష్యంతో వినోబాజీ అన్ని ధర్మాలసారాన్ని ఎత్తి లోకానికి చూపించాడు. ఈ ఉద్యమంలోని భాగమే కురాన్‌సారం. దీనిని ఉర్దూలో నుండి శ్రీ ఉమ్మెత్తల కేశవరావు గారు అనువదించారు. దీని ప్రచురణకు మాకు అవకాశం కలిగించిన సర్వోదయ ప్రకాశన్ వారికి, అనువాదకులు శ్రీ కేశవరావు గారికి, మిత్రులు శ్రీ అచ్యుతరావ్ దేశపాండే గారికి మా నమస్సులు.

సాంప్రదాయక గ్రంథాల అనువాదం చాలా కష్టము. కురాన్ షరీఫ్‌లో వాడబడిన ధార్మిక పరిభాష తెలుగు నుడికారంలో అనువదించటం చాలా కష్టమైన పని. అందువలననే ఈ అనువాదంలో అక్కడక్కడ కొంత అన్వయ క్లిష్టత కన్పిస్తుంది. అయినప్పటికి పాఠకునికి సులభ గ్రాహ్యంగా మాత్రం ఉన్నదని చెప్పవచ్చును. పాఠకలోకం తగిన

మార్పులను సూచిస్తే కృతజ్ఞతాపూర్వకంగా వాటిని స్వీకరించి రెండవ ముద్రణలో సవరణలు చేయగలమని విన్నవిస్తున్నాము.

ఈ పుస్తకాన్ని చాలా త్వరగా ముద్రించి ఇచ్చిన లలితా ప్రెస్ కార్యకర్తలకు ముఖ్యంగా శ్రీ చర్ల గణపతి శాస్త్రి గారికి మా కృతజ్ఞతలు.

ఇట్లు
**కోదాటి నారాయణరావు**
కార్యదర్శి
**సంపాదక సమితి**
గాంధీ సాహిత్య ప్రచురణాలయం,
హైదరాబాదు.

**తేది. 24-4-1974**

# తొలి పలుకు

పరమ పూజ్యులగు ఆచార్య వినోబా గారి రచనలలో "కురాన్ ారము" అత్యంత ప్రాముఖ్యము గలది. కారణము స్పష్టము. ఇది ్రపంచము నందు గల విభిన్న సంప్రదాయములకు చెందిన మానవాళి యొక్క హృదయములను మేళవించు ప్రేరణచే, చేయబడిన కృషికి లితము. ఈ గ్రంథమును హిందీ, ఉర్దూ భాషలలో వినోబా గారే వ్రాసి ్రకటించిరి. ఇంగ్లీషు, తమిళము మొదలగు ఇతర భాషలలో ఈ ంథము అనువాదము చేయబడుటచే తెనుగులో అనువదించవలెనను లంపు నాకు గలిగినది

ఇంతకు పూర్వము ఉర్దూభాషలో గల "కురానుసారము" ను రచుగా నేను పఠించుచుండువాడను వినోబాగారి రామనామచింతనమను ిందీ పుస్తకమును తెనుగులో అనువాదము చేసితిని. ఆ అనువాదమును చదివిన కొందరు మిత్రులు బాగున్నదనుటచే "కురానుసారము" ను నువదించగలనను ధైర్యము నాకు గలిగినది. నాకు అరబీ భాష నందున, ఉర్దూకురానుసారమునే ఆధారముగా చేసికొని, వినోబాజీకి ుఖ్య శిష్యులు, మరియు ఇదే రచనా కార్యక్రమములో నిమగ్నులై యున్న ి అచ్యుత్‌బాయితో సమాలోచించితిని. శ్రీ అచ్యుత్‌బాయ్ సమర్పిత పుడు, మరియు భూదానము ప్రారంభము నుంచి, నాతో కలసి ైదరాబాదులో పనిచేసిన వారగుటచే, నా యోగ్యతా యోగ్యతలు రికి తెలియును. వారునన్ను కురానుసారమును తెనుగులో అనువదించు ని సలహానిచ్చిరి. తరువాత పూజ్యులగు ఆచార్య వినోబాగారి అనుమతి రితిని. వారు అనువాదమును సర్వోత్తమముగా ఉండునట్లు చూడమనిరి.

కురాను మజీదు మూలములో సూరాలనబడు 114 అధ్యాయములు, 30 భాగములుగా విభజింపబడి అందు 6,360 వచనములు గలదిగా ఉన్నది. మహమ్మద్ పైగంబరు (ప్రవక్త) తన దివ్యవాణిచే 23 సంవత్సరముల దీర్ఘకాలములో ఈ గ్రంథమును దర్శించిరి. మక్కా పట్టణమున 13 సంవత్సరములలో 93 అధ్యాయములును, మదీనా పట్టణమున 10 సంవత్సరములలో 21 అధ్యాయములును పైగంబరుచే దర్శించబడినవి.

మహమ్మద్ ప్రవక్త ఈ గ్రంథరాజమును సొంతముగా రంజాన్ మాసములలోనే దర్శించిరి. అందుచేతనే రంజాన్ మాసము పవిత్రముగా పరిగణింపబడుచున్నది.

కురాన్‌సారములో కురాన్ మజీదు మూలము నుంచి 1065 వచనములు మాత్రమే గైకొనబడినవి. తొమ్మిది ఖండములు, 400 శీర్షికలు, 90 అధ్యాయములు ఈ గ్రంధమునందు గలవు

కురాన్‌లో వచనములు మూడు పద్ధతులలో చెప్పినట్లు బోధపడుచున్నది. కొన్ని వచనములు ఈశ్వరుడు ప్రజలనుద్దేశించి చెప్పెను. కొన్ని దూతను సంబోధించి చెప్పెను. మరి కొన్ని వచనములు దూత ప్రజలకు చెప్పినాడు.

కురాన్‌సారమును పఠించునపుడు ఈ పద్ధతిని అవగాహన చేసి కొనుట అవసరము.

కురాన్ మజీదు యొక్క ఆధ్యాత్మిక బోధ ప్రపంచము ముందుంచుటయే తమ కృషియొక్క లక్ష్యమని, ఇస్లామ్ యొక్క ఆధ్యాత్మిక శిక్షణ ఏమిటనునది ప్రత్యేకంగా వేరుచేసి అన్ని మతముల వారి సమక్షము నందుంచితినని వినోబాజీ ఒక ఉత్తరములో తెలియజేసిరి ఈ ఉద్దేశ్యమునకు సంబంధించిన వచనములే కురాన్‌సారము నందు గలవు.

ఈ అనువాదమును శ్రీ తల్లాప్రగడ ప్రకాశరాయుడుగారు మరియు గణపతిశాస్త్రిగారును, సరిచేసిరి. శ్రీ అచ్యుత్‌భాయి సమీక్షించిరి. కి హృదయ పూర్వక ధన్యవాదములు. ఇది ద్వైపీభాషకు సంబంధించిన ువాదమగుటచే పొరపాట్లుండవచ్చు.

## ఇస్లామ్ సారము

కురాన్ "బిస్మిల్లా" అను పదముతో ప్రారంభమగుచున్నది. ల్లా" అను శబ్దము శుద్ధ బ్రహ్మమునకు సార్వార్థిక నామముగా నున్నది. శబ్దము ఎట్టి ఆకారమునకు గురిగాక నిరాకారుడగు బ్రహ్మమును ేశించుచున్నది

కురాన్ మొదటి అధ్యాయము "ఆల్‌ఫాతిహా" లో శుద్ధ బ్రహ్మ ను నిర్దేశించుటకు నాలుగు ప్రధాన గుణములు చెప్పబడినవి,

1. రబ్ :- పోషించువాడు.
2. రహీం :- అడిగితే ఇచ్చువాడు.
3. రహిమాన్ :- అడుగనిచో బాధపడువాడు మరియు పరమ కృపాలుడు.
4. మాలికె యూమిద్దీన్ :- మార్గదర్శకుడు.

ఇస్లాం అనగా శాంతిమతము. దేవుడొక్కడే. మహమ్మద్ ఆతని వక్త. ఆతనిని నమ్మిన వారందరూ ముస్లింలు. ముస్లింలందరు తప్పక చరించ వలసినవి నాల్గు విధులున్నవి.

1. ప్రార్థన :- దినమునకు ఐదుసార్లు ప్రార్థన (నమాజ్) చేయ లయునని చెప్పబడినది.

౨ ఉపవాసము :- ఉపవాసము, కష్టజీవనము నలవాటు చేసి దేహారోగ్యమును, ఆత్మ నైర్మల్యమును ప్రసాదించును రంజాన్ నెల ఉపవాస కాలముగా విధించబడినది.

3. దానము :- ప్రతి గృహ యజమాని విధిగా తన ఆస్తిని బట్టి కొంత సొమ్ము నివ్వవలెనని చెప్పబడినది. ఈ ధనము పేదలకు, మత ప్రచారమునకు ఉపయోగించబడును

4 యాత్ర :- ముస్లిం లగు వారందరూ తమ జీవిత కాలములో ఒకసారియైనను మక్కాకు యాత్ర చేయవలెను. యాత్ర, జుల్హజ్, నెలలో ప్రారంభమగును. 'కానా' అను దేవాలయము చుట్టూ ఏడు సార్లు ప్రదక్షిణము చేయవలెను.

ఈ దైవీగ్రంథముయొక్క అనువాదమును గాంధీ స్మారకనిధి, ఆంధ్రశాఖ వారు ప్రచురించుటకు పూనుకొనిరి. దానికిగాను ఆ సంస్థ వారికి మరియు కార్యదర్శులగు శ్రీ కోదాటి నారాయణరావుగారికి నా ప్రత్యేక ధన్యవాదములు.

2-11-1970

ఉమ్మెత్తల కేశవరావు

# ప్రస్తావన

ఆధునిక విజ్ఞానము నేటి ప్రపంచమును చిన్నదిగా చేసినది అంతే క మానవులందరను అత్యంత సన్నిహితులుగా చేయదలచుచున్నది. స్థి పరిస్థితులలో మానవసమాజము తెగలు తెగలుగా విభజింపబడి, ప్రతి క సంఘము తమను గొప్పగను, ఇతరులను అధములుగను భావించుట ట్లు పొసగగలదు ? మన మందరము ఒకరి నొకరము బాగుగా అర్థము సుకొనవలసి యుండును. ఈ పుస్తకము అట్టి దిశలో చేయబడిన ఒక న్న ప్రయత్నము మాత్రమే.

ఈ ఉద్దేశ్యముతోనే, నేను ధమ్మపదమును మరల రచించి యున్నాను. భగవద్గీతకు సంబంధించిన నా భావములను గీతా ప్రవచన ుల ద్వారా ప్రజల సమక్షము నందుంచితిని.

భూదానము నిమిత్తము, సంవత్సరముల తరబడి నా పాదయాత్ర ాగుచున్నది. హృదయములను మేళవించుటయే ఈ నా యాత్రయొక్క కైక ఉద్దేశము అంతేగాక నా జీవిత కార్యకలాపములన్నియు హృద యములను మేళవించు ఒకే ఒక ఉద్దేశ్యముతో ప్రేరేపితమైయున్నవి. ఈ పుస్తక ప్రచురణమునందు అదే ప్రేరణ ఇమిడి యున్నది పర మాత్ముని కృపచే ఇది సఫలము కాగలదని విశ్వసించుచున్నాను.

శ్రీ ఆశ్రమము,
అస్సామ్ ప్రదేశము)
-3-1962

ఇట్లు
వినోబా
జై జగత్

# విషయ సూచిక

# 1. మంగళాచరణము

## 1. మంగళాచరణము

### 1. అల్ ఫాతిహా

1. పరమ కృపాళువు, అపార కరుణామయుడగు పరమాత్ముని నామముతో ప్రారంభించుచున్నాను.

2. ప్రతియొక స్తుతియు పరమాత్మునికొరకే. అతడు సర్వలోక పరిపోషకుడు.

3. పరమ కృపాళువు, అపార కరుణామయుడు.

4. అంతిమ దినమునకు ప్రభువు.

5. ఓ పరమాత్మా ! నిన్నే మేము ఆరాధించు చున్నాము. మరియు మేము నీ సహాయమునే కోరుచున్నాము.

6. మాకు చక్కని మార్గమును చూపించుము.

7. ఆ మార్గము నీవు ఎవరిని అనుగ్రహించితివో వారిదై యుండవలె. అది నీ ఆగ్రహముకు గురియైన వారిది గాని భ్రాంతుతులదిగాని కారాదు. 1-1-7



# 2. గ్రంథ గౌరవము

## 2. గ్రంథ ప్రకాశము

### 2. గ్రంథము కళ్యాణ మార్గగాములకొరకు

1. అలీఫ్ - లామ్ - మీమ్ -

2. ఇది ఏ సందేహము లేని గ్రంథము. కళ్యాణ మార్గములో పోవు వారికి మార్గదర్శకము.

3. ఎవరు అవ్యక్తముపై శ్రద్ధగలవారయి, ప్రార్థనకు ప్రతిష్ఠ నిచ్చు వారయి, *మేము ప్రసాదించిన దానిలో నుండి మాదారిలో ఖర్చు పెట్టువారయి ఉందురో.

4. ఎవరు ●నీ ద్వారా అవతరించబడిన దాని యందును, నీకన్న పూర్వము అవతరించిన దానియందును, శ్రద్ధగల వారయి ఇంకను మరణాంతర జీవితముపై విశ్వాసముగల వారయి ఉందురో.

5. వారు తమ ప్రభువు చూపిన మార్గమునందున్న వారు, మరియు వారే సఫలులు. 2-1-5

### 3. వచన ద్వయము - (మౌలికములు, లాక్షణికములు)

1. అతడే నీ యందు గ్రంథమునవతరింపజేసెను. దానిలో కొన్ని వచనములు స్పష్టముగా ఉన్నవి. గ్రంథమునకు అవియే మౌలిక

---

* మేము, నేను = పరమాత్మ,

● నీవు = మొహమ్మద్ పైగంబరు.

ములు. ఇతరములు లాక్షణికములు. కుటిల హృదయులు భ్రమను వ్యాపింపజేయుటకును, యదార్థమును కప్పిపుచ్చుటకును, లాక్షణికములగు వచనముల వెంట బడుచున్నారు. వాస్తవముగా ఆ వచనముల యదార్థతను పరమాత్ముడు తప్ప, ఇతరు లెవ్వరును ఎరుంగరు. 3-1

## 4. సర్వోత్తమైన సారమును గ్రహింపుడు

1. ఈ వచనములు విని, వీనిలో గల సర్వోత్తమమైన సారము ననుసరించి ఎవరు నడతురో, వారికే పరమాత్ముడు మార్గమును చూపించెను. వారే బుద్ధిమంతులు. 39-18

## 5. స్పష్టమైన బోధ

1. నిస్సందేహముగ ఇదొక సదుపదేశము.

2. ఇష్టముగల వారెవరయినను సరే, దీనిని గూర్చి చింతన చేయ వచ్చును. 80-11-12

## 6. శాస్త్రమును ప్రకటించవలసి యున్నది. దాచరాదు.

1. ప్రజలకొరకు ఈ గ్రంథమును అవశ్యము ప్రకటింపుడు.

# 3. గ్రంథ స్వరూపము

## 7. గ్రంథము మాతృభాషలో

7. మేము కురానును అరబి భాషలోగాక, ఇతర భాషలో రచించి నచో, అచటి ప్రజలు "దీనిలోగల వచనములను విడదీసి యెందుకు తెలుపలేదు, ఇదేమిటి ? మేము అరబు ప్రజలము, భాష పరాయిది" అందురు.

చెప్పు : ఇది శ్రద్ధావంతులకు ప్రబోధకరము,
సాంత్వనము కలిగించేదిగా నున్నది. 41-44

## 8. సరళమగు కురాన్

1. మేము కురానును సులభముగా అర్థమగునట్లు రచించితిమి. అయితే ఎవరయినను దీనిని చింతన చేయువారు గలరా ? 54-17

## 9. కవియొక్క శబ్దములు కావు

1. మీకు గోచరించుచున్న వస్తువు.

2. మరియు మీ కగోచరించుచున్న వస్తువు ప్రమాణము. (సాక్షి) గా

3. ఈ కురాన్ మహనీయుడగు దూత చెప్పిన పలుకులు.

4. అవి యే కవి మాటలును కావు. అయినను మీరు తక్కువ శ్రద్ధ చూపుచున్నారు.

5. లేక ఇవి దైవజ్ఞుని (జ్యోతిష్కుని) వాక్కులు గావు. అయిననూ మీరు కొలది ధ్యానమునే ఇచ్చుచున్నారు.

6. దీని (ఈ గ్రంథము) అవతరణ విశ్వప్రభువువల్ల జరిగినది.

## 10. హృదయ సంతుష్టినిచ్చు గ్రంథము

1. పరమాత్ముడు సర్వోత్తమమగు కథనమును, అనగా వర్ణించదగినదియు, పరస్పరము మేళవించునదియునగు గ్రంథమును అవతరింపజేసెను. దానిచే పరమాత్మునికి వెరచు వారి మానసములు ఉలికిపడుచున్నవి. పిమ్మట ఈశ్వర స్మరణచే వారి శరీరము, అంతఃకరణములును మార్దవముపొందుచున్నవి. 39-23

## 11. ఆవర్తనీయమగు ఆల్ ఫాతిహా

1. నిస్సందేహముగా మేము పునః పునః పఠించదగు ఏడు వచనములను మరియు మహత్తరమగు కురానును ప్రసాదించితిమి. 15_87

# 4. పఠన పద్ధతి

## 12. శుచిర్భూతమై

1. నిస్సందేహంగా ఈ కురాను ఆదరణీయమైనది.

2. శుచిర్భూతులగు వారే దీనిని స్పృశింతురు. 56-77-79

## 13. ఈశ్వరుని నాశ్రయించి పఠింపదగినది

1. ఎపుడు నీవు కురానును పఠింప ప్రారంభింతువో, అపుడు బహిష్కరించబడిన సైతాను నుంచి కాపాడబడుటకు పరమాత్ముని శరణు వేడుము. 16_98



# ద్వితీయ ఖండము

## ఈ శ్వ రు డు

# 3. ఒకడే

## 5. ఒకడే అద్వితీయుడు

### 14. ఈశ్వరుడు ఒకడే

1. చెప్పు : ఈశ్వరుడు ఒక్కడే.
2. ఈశ్వరుడు నిరపేక్షుడు.
3. అతడు పుట్టిన వాడును కాదు. పుట్టించబడిన వాడును కాదు.
4. అతనికి సమానులెవ్వరును లేరు.

### 15. ఈశ్వరునికి పుత్రుడు గలదనుట శోభ నీయదు

1. ఈశ్వరునికి పుత్రుడున్నాడని ప్రజలు అనుచున్నారు.
2. మీరు ఒక భయంకరమగు మాటను చెప్పుచున్నారు.
3. దానివలన ఆకాశము పగిలిపోవచ్చు. భూమి బ్రద్దలు కావచ్చు. మరియు కొండలు పిండి, పిండిఅయి కూలిపోవచ్చు.
4. అయినా ఈ ప్రజలు పరమాత్మునికి పుత్రుడు ఉన్నాడని అందురు.
5. మరి ఏ ఒకరిని పుత్రుడుగా అంగీకరించడము పరమాత్మునికి శోభనీయదు. 19-88-92

### 16. భక్తబృందములు చేయు శపథము

1. గణసజ్జితులు.
2. విద్రావకులు.

3. మరియు పతన, మనన శీలుర శపథముతో,

4. నిస్సందేహముగా మీరు సేవింపదగిన వాడు ఒకడే.

5. అతడు ఆకాశమునకు, పృధివికి, వానిలోగల సకల వస్తు సముదా
యమునకు మరియు అవి ఉదయించిన స్థానములకు అధిపతి.

## 17. ఏసు సాక్ష్యము

1. మరియమ్మ పుత్రుడవగు ఓ ఏసూ! పరమాత్మనుగాక నిన్నును, మరి మీ తల్లిని, ఇద్దరను ఉపాస్యదేవతలుగా, పూజించమని నీవు ప్రజలకు చెప్పితివా? అని ఈశ్వరు డడిగినప్పుడు ఏసు ఇట్లు చెప్పును.

"నీవు పవిత్రుడవు. నేనట్లనుట నాకు శోభనీయదు. అందుకు నాకధికారము లేదు. నేనట్లన్నచో దానిని నీ వెరింగియే యుందువు. నా మనసులోగల దంతయు నీవెరుంగుదువు, కాని నీ మనసులో గలది నాకు తెలియదు. నిస్సందేహముగా అవ్యక్తము నెరిగిన పరిజ్ఞాతవు నీవే.

2. కేవలము నీవు నాకు ఇచ్చిన ఆజ్ఞనే, మీకును, నాకును ప్రభువగు ఈశ్వరునికి భక్తులు కండని వారితో చెప్పితిని. నేను వారిమధ్య ఉన్నంత కాలము వారికి సాక్షిగానుంటిని. మరి నీవు నన్ను నీ సన్నిధికి చేర్చుకొనినప్పటి నుండియు, నీవే వారిని నిరీక్షించు చుంటివి. ప్రతి విషయమునకు నీవే సాక్షివి.

3. నీవు వారిని శిక్షించినను, వారు నీ దాసులే. వారిని క్షమించినను నిస్సందేహముగా నీవే సర్వజేతవు, సర్వ విదుడవును. 5-111-121

## 18. ముగ్గురని అనకుడు

1. గ్రంధము ప్రమాణముగల ఓ జనులారా! మీరు మీ మతమును గురించి అతిశయోక్తులను చెప్పకుడు. మరియు పరమాత్ముని విషయములో సత్యము తప్ప మరేదియును పల్కకుడు. నిస్సందేహముగా ఏసుక్రీస్తు మరియమ్మ పుత్రుడు. మరియు పరమాత్మచే పంపబడిన దూత. శబ్దము మరియమ్మ వైపుగా పంపబడినది, శబ్దము పరమాత్మునివైపునుండి ప్రసరించిన ప్రాణము కాబట్టి ఈశ్వరునిపై. అతడు పంపిన దూతలపై శ్రద్ధగల్గియుండుడు. ముగ్గురని అనకుడు. ఆ మాటల నుండి తప్పుకొనుడు, ఇదే మీకు మంచిది. నిస్సందేహముగా ఈశ్వరుడొకడే భజనీయుడు, పవిత్రుడు. పుత్రుడు గలడను విషయముకు అతీతుడు భూమి ఆకాశములోగల సమస్తము అతనిదే. వాని రక్షణలో అతడు సంపూర్ణ సమర్థుడు. 4-171

## 19. అక్కడ సూర్యుడు ప్రకాశించదు

1. మేము, ఇబ్రాహాంకు, భూమ్యాకాశములలో గల ఆధిపత్యమును, అతడు విశ్వసించు వాడగుటకు చూపసాగితిమి.

2. రాత్రి అతనిపై అంధకారముగప్పగా అతడొక నక్షత్రమును చూచి ఈ నక్షత్రమే నాకు ప్రభువని నుడివెను. కాని ఆ నక్షత్రము అస్తమించగా, అస్తమించునవి, నాకు నచ్చవనెను.

3. తర్వాత ప్రకాశించు చంద్రుని చూచి ఇతడే నా ప్రభువని చెప్పెను. చంద్రుడు క్రుంగగా అపుడు, నా ప్రభువు నాకు దారి చూపించనిచో, నిశ్చయముగా నేను దారి తప్పిన వాడనగుదు" ననెను.

4. అటు తర్వాత దీప్తిమంతుడగు సూర్యుని చూచి, "ఇతడే నా ప్రభువు. ఇతడు అందరికంటే ప్రచండుడు అనసాగెను. కాని అతడు కూడ అస్తంగతుడగుటనుచూచి ఓ, నా ప్రజలారా! ఈశ్వరునికి భాగస్వాములని ఎవరినైతే మీరందురో వారి నుంచి నేను ముక్తుడను. అని హెచ్చరిస్తూ ఇట్లు పలుకసాగెను.

5. "నిశ్చయముగా భూమ్యాకాశములు సృష్టించిన వానివైపే ఏకాగ్రుడనై, నా ముఖమును త్రిప్పితిని. నేనువేరు వారిలోని వాడనుగాను"

## 20. సూర్య చంద్రులను సృష్టించిన నిర్మాతకు ప్రణతులు చేయుడు.

1. సూర్యునికి, చంద్రునికి ప్రణతులు చేయకుడు మీరు పరమాత్మపై భక్తి చూపదలచినచో సూర్యచంద్రులను సృష్టించిన వానికే ప్రణతులు చేయుడు.

# 6. దేవతా నిషేధము

## 21. దేవతలనేకులున్నచో

1. పరమాత్ముడు తనకు పుత్రుడుగా ఎవరిని నిర్ధారణ చేయలేదు. మరియు అతనితోపాటు ఇతర భజనీయులెవరును లేరు. అట్లే యున్నచో ఆ భజనీయ దేవతలు తాము నిర్మించిన వస్తువును వేరుచేసి, యుందురు. మరియు ఒకరిపై నొకరు ఆక్రమణ జరుపుకొను వారు. పరమాత్మ వారి మాటలకన్న విలక్షణుడు.

23-91

## 22. బహుయజమానుల బానిస

1. "ఒక మనుష్యునికి పోట్లాడు స్వభావము గల యజమాను లనేకులు గలరు. మరొకనికి ఒకే ఒకడు. ఏమి! వీరు ఉభయులు సమానులగుదురా?" అని. పరమాత్మ ఒక యుదాహరణ మిచ్చెను. స్తుతి సర్వము పరమాత్మువి కొరకే. కాని పెక్కురు దీనిని తెలుసుకొనుట లేదు. 39-29

## 23. సాలెపురుగు గూడు

1. పరమాత్ముని కాక ఇతరులను సంరక్షకులుగా అనుకొను వారిని సాలెపురుగుతో పోల్చవచ్చును. ఆ పురుగు ఒక గూటిని నిర్మించుకొనును. కాని నిస్సందేహంగా దాని యిల్లు ఇండ్లన్నింటికన్నను బలహీనమైనది. అయ్యో! దీనిని వీరు తెలుసుకొంటే గదా!
19-41

## 24. కల్పితభక్తి మరియు దాని యదార్థత

1. పరిశుద్ధమగు భక్తి పరమాత్ముని కొరకే యని జ్ఞప్తియందుంచుకొనుడు. పరమాత్ముని కాక ఇతరులను సంరక్షకులుగా ఏర్పరచుకొనినవారు "పరమాత్ముని యొద్దకు, మమ్ములను వీరు చేర్చుదురు గాన మేము అన్యులను భజించుచున్నామని" చెప్పుచుందురు.

కాని వారు ఏ వస్తువు గురించి విరోధించుచున్నారో ఆ విషయమై పరమాత్ముడు నిస్సందేహంగా నిశ్చయము చేయగలడు. నిస్సందేహముగా అసత్యవాదికి, సత్యద్రోహికి ఈశ్వరుడు మార్గము చూపించడు. 39-3

## 25. ఈశ్వరునికి గల ఉభయశక్తులు దేవతలకు లేవు

1. అడుగు : మీరు కల్పించిన ఈశ్వరుని భాగస్వాములలో మొదటి సారి ఉత్పత్తిచేసి, రెండవసారి ఉత్పత్తి చేయగలవారు ఎవరయినా గలరా ?

చెప్పు : పరమాత్మ మొదటిసారి పుట్టించుచున్నాడు. మరియు రెండవసారి పుట్టించగలడు. అయినపుడు మీరు తిరిగి ఏదారి పోవుదురు ?

2. అడుగు : మీ భాగస్వాములలో సత్యమార్గమును చూపించగలవారు ఎవరైనా గలరా ?

చెప్పు : పరమాత్మ. సత్య మార్గమును చూపించుచున్నాడు. అయినప్పుడు సత్యమార్గదర్శి అనుసరణీయుడా ? లేక ఒకరు చూపకున్నచో మార్గమే తెలియని వాడా ?

మీకు ఏమి రోగము ? ఎటువంటి నిర్ణయము చేయుచున్నారు. 10-34-35

## 26. దేవతలు ఈగలను గూడ ఎగుర గొట్టలేరు

1. ప్రజలారా : ఒక దృష్టాంతము ఇవ్వబడుచున్నది. సావధానులై వినుడు. పరమాత్ముడు దప్ప మీరు ఎవరిని పిలుచుచున్నారో వారందరు కూడియు ఒక ఈగనైనను సృష్టించలేరు. వారినుండి ఈగ ఏ వస్తువునైనా లాగుకొన్నచో దానిని విడిపించుకొనజాలరు. ఈ యాచ్యయాచకులు ఎటువంటి దుర్బలురు ? 22-73



# 4. జ్ఞానమయుడు

## 7. పరమాత్ముడు ప్రకాశ స్వరూపుడు

### 27. ఈశ్వరీయ ప్రకాశము

1. పరమాత్మ ఆకాశమునకు, భూమికి ప్రకాశ స్వరూపుడు ఈ ప్రకాశమునకు ఒక దృష్టాంతము గలదు. "ఒక గూడు. ఆ గూటిలో ఒక దీపము అది గాజుబుడ్డిలో నున్నది. ఆ బుడ్డి ప్రకాశమానమగు నక్షత్రమువలె నున్నది. (దీపము) మంగళ ప్రదమగు వృక్షము, అనగా జైతూన్‌చే ప్రజ్వలితము చేయబడుచున్నది ఆ వృక్షము తూర్పుగా నున్నదియు గాదు, పడమరగా గూడ లేదు. అగ్ని స్పర్శ లేకున్నను దాని తైలము వెలుగుచుండును. అచట ప్రకాశమే ప్రకాశము. ఈశ్వరుడు తన క్లిష్టులగువారికి తన తేజోమయ మార్గమును చూపించుచున్నాడు. మరియు లోకుల కొరకు దృష్టాంతములను వర్ణించుచున్నాడు. అతడు సర్వజ్ఞుడు.

2. ఈశ్వరుడు ఏ గృహములను ఉన్నతి చేయుటకు మరియు ఏయే గృహములలో నామస్మరణ జరుపుటకొరకు ఆజ్ఞ ఇచ్చెనో (ఆ గృహములలో) ఈ తేజము ఉంటూ యున్నది. అచట ప్రాతః సాయములందు అతని స్మరణ జరుగుచుండును.

3. వ్యాపారము, క్రయవిక్రయములు ఎవరిని ఈశ్వర స్మరణ నుండి నియమిత ప్రార్థనుండి, నిత్యదానమునుండి విముఖులను చేయజాలవో వారు తమ నేత్రములను, తమ హృదయములను తల క్రిందులుచేసే ఆ దినమునుంచి భయపడుదురు.

4. వారు చేయు క్రియా కలాపములకు, ఈశ్వరుడు ఉత్తమోత్తమ ఫలము నిచ్చుటకు మరియు తన వైభవము నుండి విపులమైన భాగమును ప్రసాదించుటకును వారట్లు చేయుచున్నారు. పరమాత్మ తన కిష్టులగు వారికి లెక్కచేయలేనంతగా ఇచ్చుచున్నాడు.

5. ఇక, శ్రద్ధలేని వారి కార్యకలాపములు, అడవిలోని ఎండమావుల వంటివి. దాహము గొన్నవాడు నీరని తలచి వెళ్ళగా పొందునది ఏమియూలేదు. అప్పుడు తన చెంతనే ఈశ్వరుడున్నట్టు గ్రహించు చున్నాడు ఇలా అతడు తన లెక్కను పూర్తిచేసుకొనును. కాని ఈశ్వరుడు శీఘ్రముగా వానినుంచి లెక్క తీసుకొనుచున్నాడు.

6. లేక, అంధకారము లోతైన సముద్రములో అలలు, అలలపై అలలు, దానిపై కారు మబ్బులు తన చేయి చాచినను కనబడనంత అంధకారము. ఈశ్వరుడు ఎవరికి ప్రకాశము ఇవ్వడో వారికి ప్రకాశమే లేదు. 24-35-40

# 8. సర్వజ్ఞుడు

## 28. ఈశ్వరుడు సర్వహృదయసాక్షి

1. జాగ్రత్త ! వారు తమ వక్షస్థలములను ఈశ్వరుని నుంచి మరుగు పరచుటకు ముకుళింపజేయుచున్నారు. వినుడు : వారు వస్త్రచ్ఛాదనము చేసి దేనిని దాచెదరో మరి ఏది చూపెదరో ఈశ్వరునికి తెలియును. నిస్సందేహముగా ఈశ్వరుడు అంతఃకరణము యొక్క రహస్యములను ఎఱిగినవాడు.

2. భూమి మీద సంచరించు ప్రతి ప్రాణియొక్క జీవనోపాధి ఈశ్వరాధీనమై యున్నది. వాని నివాసస్థానములను, విశ్రాంతి స్థలము

ఐను అతడు ఎరుగును. ఆ విస్పష్టగ్రంథములో ఈ విషయము లన్నియు ఉండియున్నవి.

3. అతడే ఆరు దినములలో ఆకాశములను, భూమిని ఉత్పత్తి చేసెను. మీలో సత్కార్యములు చేయు వారెవరో పరీక్షించుటకు అనువుగా అతని సింహాసనము నీటిపైన గలదు. మృత్యువు పిదప నిస్సందేహముగా మీరు తిరిగి లేపబడుదురని నీవు చెప్పినచో శ్రద్ధాహీనులు ఇది ఒక ఇంద్రజాలమని తప్పక యందురు. 11-5-7

## 29. సర్వకర్మసాక్షి

1. నీవు ఏ స్థితిలోనైనా ఉండు. కురాన్ యొక్క ఏ పాఠమైనా పఠన చేస్తూయుండు, మరియు మీరు ఏదైనా పని చేయుచుండుడు. ఆ కార్యములో మీరు నిమగ్నులగుచో మేము తప్పక మీచెంతనే యుందుము. ఆకాశములో గాని, భూమిలో గాని అణు మాత్రపు వస్తువేదియు నీ ప్రభువు నుంచి మరుగుపడియుండ జాలదు. ఆ విస్పష్టగ్రంథములో చెప్పబడని వస్తువేదియు చిన్నది గాని, పెద్దదిగాని లేదు. 10-61

## 30. పరమాత్మ చేతిలో అవ్యక్తపు తాళపుచెవులు

1. అయన వద్దనే అవ్యక్తముయొక్క తాళపుచెవులు గలవు. వాటిని అతడుతప్ప అన్యులు ఎవ్వరునూ ఎరుగరు. పృథివిలోను, సముద్రములోనుగల సమస్తమును అతడు ఎరుగును. అతని ఆజ్ఞ లేనిది, ఏ ఆకును రాలజాలదు. విత్తనముయొక్క ఒక్క గింజ గూడ భూమియొక్క అంధకారావృతమగు గర్భములో పడజాలదు ఆ విస్పష్టగ్రంథములో చేర్చబడని, పచ్చనిది లేక ఎండిన వస్తువేదియునులేదు. 59-6

## 31. ఈశ్వరుడు పంచజ్ఞుడు

1. నిస్సందేహముగా అంతిమ దినముయొక్క జ్ఞానము పరమాత్మునికే గలదు. అతడే వర్షమును కురిపించుచున్నాడు. మాతృ గర్భము నందు గలదంతయు అతడెరుగును. రేపు ఏమి చేయబోవునది ఏ ప్రాణియు ఎఱుగదు. ఎవరు ఎక్కడ మరణించునది, ఎవ్వరికిని తెలియదు. నిస్సందేహముగా పరమేశ్వరుడు సర్వజ్ఞుడు. సర్వ విదుడు. 31-34

## 32. ఈశ్వరుడు గర్భజ్ఞుడు

1. ప్రతి స్త్రీ గర్భములో ఏమున్నది, ఆగర్భములో ఎట్టి హెచ్చు తగ్గులు కలుగునో ఈశ్వరుడు ఎరుగును. అతని వద్ద ప్రతివస్తువు ఒక పరిమాణములో వున్నది.

2. అతడు వ్యక్తావ్యక్తములను తెలిసిన వాడు. సర్వశ్రేష్ఠుడు, సర్వోచ్చుడు.

3. మీలో మెల్లగా మాట్లాడువారు, బిగ్గరగా అరచువారు, రాత్రిపూట దాగుండు వారు మరియు పగటివేళ తిరుగుచుండు వారు అందరు (అతనికి) సమానులు. 13-8-10

## 33. కంఠనాళము కంటెను సన్నిహితుడు

1. మేము మానవుని సృష్టించితిమి. అతని మనస్సులో ఏ ఆలోచనలు వచ్చుచుండునో వాని నన్నింటిని మేము ఎరుగుదుము. మరియు మేము అతని కంఠనాళము కంటెగూడ మిక్కిలి దగ్గరగా నున్నాము. 50-16

## 34. దృష్టికి ద్రష్ట

1. దృష్టి అతనిని పొందజాలదు. కాని అతడు దృష్టిని ఆకళించు కొనును. అతడు సూక్ష్మదర్శి, జాగరూకుడు. 6-103

## 35. ఆది - అంతము - వ్యక్తము - అవ్యక్తము

1. అతడే ఆది, అతడే అంతము, అతడే వ్యక్తము, అతడే అవ్యక్తము, సర్వము ఎరిగిన వాడతడే. 57-3



# 5. దయామయుడు

## 9. దయాళువు

### 36. ఈశ్వరుని గుణ గౌరవము

1 నిస్సందేహముగా అతడే మొదటిసారిగా పుట్టించుచున్నాడు. మరియు రెండవసారి పుట్టించగలడు.

2. అతడే క్షమించువాడు, ప్రేమమయుడు.

3. సింహాసనాధిష్ఠితుడు, కీర్తిమంతుడై యున్నాడు.

4. ఇష్టమనుకొన్నది చేయగలడు. 85-13-16

### 37. ఈశ్వరుడు మీ భారమును తగ్గించ కోరుచున్నాడు

1. మీ పూర్వుల మార్గమును మీకు చూపవలెనని, మిమ్ముల ప్రసన్న పరచి క్షమించవలయునని పరమాత్మునికి ఇష్టము గలదు. పరమాత్మ సర్వజ్ఞుడు, సర్వవిదుడు.

2. పరమాత్ముడు మీపై ధ్యానముంచ కోరుచున్నాడు, వాసనాపరులు మిమ్ము మార్గమునుంచి చాలా దూరముగా నుంచ కోరుదురు.

3. మనుష్యుడు అశక్తుడుగా సృష్టింపబడుటచే మీపైగల భారమును పరమాత్ముడు తగ్గింపకోరుచున్నాడు. 4-26-28

### 38. ఈశ్వరుడు దయాదక్షుడు

1. నావచనములను మన్నించువారు నీ దగ్గరకు వచ్చినప్పుడు "మీకు సలాము" అని చెప్పుము. (అనగా మీకు శాంతి, శరణ్యము

లభించుగాక) మీ ప్రభువు కరుణించు బాధ్యతను స్వీకరించినాడు. అజ్ఞానముచే మీరు ఏదేని చెడుపని చేసినను వెంటనే పశ్చాత్తాప పడి, సవరించుకొనుడు. అతడు క్షమించగల కరుణామూర్తి. 6-54

## 39. ఈశ్వరుడు దయాళువును, కఠినుడును

1. అత్యాచారములు జరుపుచున్నను ప్రజలను ఈశ్వరుడు నిస్సందేహముగా క్షమించును. అతడు కఠినముగా దండించువాడుగా ఉన్నాడు. ఇది నిశ్చయము. 13-6

## 40. ఈశ్వరుని క్షమాపరిమితులు

1. అజ్ఞానముచే చెడుపనులు చేసి వెంటనే పశ్చాత్తాపపడు వారి పశ్చాత్తాపమును ఈశ్వరుడు స్వీకరించి వారిని క్షమించును. పరమాత్మ సర్వజ్ఞుడు, సర్వవిధుడు.

2. చెడుపనులు చేయుచూ కొందరు మృత్యువాసన్నమైనప్పుడు, మేము పశ్చాత్తాప పలికితిమని చెప్పుదురు. అట్టి వారి పశ్చాత్తాపమును ఈశ్వరుడు స్వీకరించడు. శ్రద్ధలేని స్థితిలో మరణించు వారి పశ్చాత్తాపము కూడ స్వీకరించబడదు. ఇట్టి వారల కొరకు మేము భయానకమగు శిక్షలు సిద్ధపరచి యుంచినాము. 4-17-18

## 41. క్షమించరాని నేరము

1. నిస్సందేహముగా ఈశ్వరుడు అతనితో మరొకని భాగస్వామిగా చేయగోరువిషయము నెపుడు క్షమించడు. ఇది తప్ప ఇతర దోషములను తన ఇష్టము కొలది క్షమించుచున్నాడు. పరమాత్మకు భాగస్వామి కలడని తలచుట నిశ్చయముగా గొప్ప దోషము. 4-40

# 10. ఈశ్వరీయ వరదానములు

## 42. ఆధ్యాత్మిక, నైతిక. భౌతిక వరదానములు

1, కృపాలుడు.

2. ఖురానును ప్రబోధించెను.

3. మానవుని సృష్టించెను.

4. అతనికి మాటలాడ నేర్పెను.

5. సూర్యుడు, చంద్రుడు నియమ బద్ధులై యున్నారు.

3. నక్షత్రములు, వృక్షములు ప్రణతులర్పించుచున్నవి.

7. ఆకాశమును ఉన్నత మొనర్చెను. మరియు త్రాసును అమర్చెను.

8. కాన తూకములో అతిక్రమణ చేయకుడు.

9. మరియు న్యాయముగా సరియగునట్లు తూచుడు తగ్గించకుడు.

10. భూమిని జీవకోటికొరకు సృష్టించెను.

11. దాని (భూమి) లో ఫలములున్నవి. నీరుకలిగి, ఫలభరితములగు ఖర్జూర వృక్షములు గలవు.

12. పొట్టు, పొరగల ధాన్యములు మరియు సుగంధిత పుష్పములు గలవు.

13. అయినపుడు మీ రుభయులు ఈశ్వరుని యే యే ఉపకారములు, చమత్కృతులకు విముఖత చూపెదరు. ౫౫-1-13

## 43. అడిగినది ఇచ్చెను

1. భూమ్యాకాశములు సృష్టించిన వాడే ఈశ్వరుడు. ఆకాశము నుండి వర్షమును కురిపించెను. ఆ వర్షముచే మీకొరకు ఫలములను ఆహారముగా సిద్ధముచేసెను. పరమాత్ముని ఆజ్ఞచే నౌకలు సముద్రమున నడచుచున్నవి. వానిని మీ ఆధీనము చేయుంచెను. నదులను మీ సేవ కొరకు నియోగించెను.

2. సతతము సంచారపరులగు సూర్యచంద్రులను, మీ సేవకొరకై నియమించెను, రాత్రింబగళ్ళు గూడ మీ సేవకొరకు నియుక్తములై యున్నవి.

3. మీరు అభ్యర్థించిన వన్నిటిని అతడు ప్రసాదించెను. అందుచేత అతని వరదానములను మీరు లెక్కించదలచినా, లెక్కించ లేరు.
14-32-34

## 44. ద్వంద్వ నిర్మాణము - అతని కృపయే

1. చెప్పు : ఇదిగో ఈశ్వరుడు పునరుత్థాన దినము వరకు సదా రాత్రినే కల్పించినచో, అతడుగాక మీకో పగలు గల్పించగల సమర్థు లెవరు ? ఏమి ? మీరు వినలేదా ?

2. చెప్పు : ఇదిగో చూడండి ! ఈశ్వరుడు పునరుత్థాన దినము వరకు పగలే కల్పించినచో ఈశ్వరుడుతప్ప మరెవరు మీ విశ్రాంతికై రాత్రిని తేగలరు ? దీనిని మీరు ఎందుకు ఆలోచించరు ?

3. అతడు దయతో మీ విశ్రాంతికి, మరియు అతని కృపావైభవాన్ని అనుభవించుటకు దివారాత్రములను కల్పించెను. అందుకుగాను మీరు కృతజ్ఞులుకండు.
28-71-73

## 45. మనుజుని ఆహారము

1. మనుజుడు తన ఆహారము వైపు చూచుగాక !

2. మేము ఉపరితలము నుంచి పెద్దగా వర్షము కురిపించితిమి.

3. మరి మేము ప్రత్యేకమగు పద్ధతితో భూమిని చీర్చితిమి.

4. తర్వాత దానినుంచి ధాన్యమును పండించితిమి

5. ద్రాక్షను, కూరగాయలును

7. దట్టమైన తోటలును

8. తృణఫలాదులను ఉద్భవింపజేసితిమి.

9. అవి మీకొరకును, మీ పశువుల మేలుకొరకును, 80-24-32

## 46. పాలు - ద్రాక్ష - తేనె

1. నిస్సందేహముగా చతుష్పాతులయందు కూడ మీకై శిక్షణనిచ్చితిమి. మేము వాని యుదరమునుంచి పేడనిచ్చి, రక్తము మధ్యనుంచి మంచి రుచికరమగు పాలను త్రాగించుచున్నాము.

2. ఖర్జూరము, ద్రాక్షఫలములనుండి మీరు మంచి ఆహారమును, మధ్యమును సిద్ధము చేసుకొనుచున్నారు. వీనితో ఈశ్వరీయ చిహ్నములున్నవని వివేకముగలవారు ఎరుగగలరు.

3. చెట్లు, గుట్టలు, మరియు ఎత్తగుచోట్లలో గూండ్లు కట్టుకొను నేర్పు తేనెటీగలకు ప్రభువు కలిగించెను.

4. (అవి) ఫలము లన్నిటిని భక్షించుచూ ! తమ ప్రభువు కల్పించిన సరళమగు మార్గము ననుసరించుచుండును. వాని ఉదరమునుంచి త్రాగుటకు రంగు రంగుల తేనె వెడలుచున్నది. అది ప్రజలకు

మంచి ఆరోగ్యకరమైనది. చింతన చేయువారికి నిస్సందేహముగా వీనిలో ఈశ్వరీయ చిహ్నములు కనబడగలవు. 16_66_69

## 47. బుద్ధి సర్వోత్తమ వరము

1. ఈశ్వరుడు తనకు ఇష్టులగు వారికి బుద్ధిని ఇచ్చుచున్నాడు. ఎవరికి బుద్ధి ప్రసాదించెనో వారికి, పరమ కళ్యాణము చేకూరి నట్లు, బుద్ధిమంతులే సదుపదేశములను మన్నింతురు. 2-269



# 3. కర్త

## 11. సృష్టి కర్త

### 48. ప్రశ్న పంచకము

1. మంచిది. ఆకాశములను, భూమిని ఎవరు సృష్టించిరి ? మీకొరకు యెవరు నీటిని రప్పించిరో, మరి వారే అందమగు తోటలను పెంచి, వృక్షములను నాటిరి. ఈ వృక్షములను రక్షించు శక్తి మీకు లేదు ? అయినపుడు ఏమి ? ఈశ్వరుడు దప్ప మరెవరైన నియంత గలడా ? ఎవరును లేరు. అయినా వారు పెడ ముఖము పెట్టుకొనియున్నారు.

2. భూమిని నివాస యోగ్యముగా చేసి, దాని మధ్య నదులు, వాటికి గాను పర్వతముల నిర్మాణము యెవరు చేసిరి ? ఇంకను రెండు సముద్రముల మధ్య సీమా రేఖలు వేసినదెవరు ? ఈశ్వరుడు తప్ప మరెవరు చేసిరి ? యెవరును లేరు. అయినను ఈ విషయ మును హెచ్చు మంది తెలుసుకొనుట లేదు.

3. ఆర్తుడు మొర పెట్టుకొన్నప్పుడు దానిని ఆలకించు వారును, వారి సంకటమును తీర్చువారును, మిమ్ములను భూమి మీద విశ్వస్తులు గాను చేసినది ఈశ్వరుడు గాక మరెవ్వరు కాని మీరు చాల తక్కువ ధ్యానమిచ్చుచున్నారు.

4. లేక, భూమి సముద్రముల మధ్యగల అంధకారములో మీకు దారి చూపించు వాడెవరు ? మరియు వాయువును తన కృపకు అగ్ర దూతగా జేసి శుభ సందేశమిచ్చుటకు పంపువారెవరు ? ఏమి,

ఈశ్వరుడు గాక వేరొక నియంతగలడా ? వారు నిర్ధారణ చేయు భాగస్వాములకంటే ఈశ్వడు ఉన్నతుడు, సర్వశ్రేష్టుడు.

5. మంచిది, మొదటిసారి మరి రెండవసారి పుట్టించు వాడెవరు ? ఆకాశము, నుంచి భూమి నుంచి మీకు ఆహారమిచ్చు వారెవరు !

ఏమి ! ఈశ్వరుడు గాక మరెవరయినా నియంత గలడా ?

చెప్పు : మీరు సత్యవంతులగుచో ప్రమాణము తెండు.

27-60-64

## 59. దేవదూతల నిర్మాత

1. స్తోత్రము లన్నియు ఈశ్వరుని కొరకే. అతడు ఆకాశమును, భూమిని సృష్టించినవాడు, దేవదూతలను సందేశవాహకులుగా చేయువాడు. వారు రెండు-రెండు మూడు-మూడు, నాలుగు-నాల్గు రెక్కలు గల వారు. ఉత్పత్తిలో అతడు ఇష్టమున్నట్లు హెచ్చింప గలడు. నిస్సందేహముగా ఈశ్వరుడు సర్వ కర్మ సమర్థుడు.

35-1

## 50. వికాస కర్త

1. నిస్సందేహముగా ఈశ్వరుడు ధాన్యపు బీజములను, టెంకలను ఛేధింపజేసి మొలకలెత్తించుచున్నాడు. చనిపోయిన వారి నుండి జీవులను సృష్టించుచున్నాడు. జీవులను మృతులుగా జేయువాడు అతడే. ఇట్టివాడే ఈశ్వరుడు. అయినపుడు మీరు ఎటువైపు బెదరిపోవుచున్నారు ?

2. అతడే ఉషఃకాల కిరణములను ప్రస్ఫుటిత మొనరించుచున్నాడు. విశ్రాంతికి రాత్రిని గణితము కొరకు సూర్యచంద్రులను సృష్టించి నాడు. ఇది సర్వజ్ఞునిచే ఏర్పాటు చేయబడిన ప్రణాళిక.

3. భూసాగరములలోని అంధకారమునందు మీరు మార్గము కనుగొనుటకై అతడే నక్షత్రములను నిర్మాణము చేసెను. నిశ్చయముగా అతడు తన చిహ్నములను బుద్ధిమంతులకై సవివరముగా స్పష్ట పరచి యుంచినాడు.

4. అతడే మిమ్మందరిని ఒకే ప్రాణముచే సృష్టించెను. మరి ఒక స్థానము నిలకడకు, మిమ్ముల చేర్చియుంచుటకు మరొక స్థానము కలదు. మననశీలుర కొరకు అతడు తన చిహ్నములను స్పష్టముగా వివేచన జేసియున్నాడు.

5. అతడే ఆకాశము నుండి నీటిని రప్పించెను. ఆ నీటిచే వనస్పతులను మేము ఉత్పత్తి చేసితిమి. పైరులు పెరుగుచున్నవి. పైరుల వెన్నుల నుంచి గింజలు, ధాన్యములు వచ్చుచున్నవి. ఫలభరితములగు ఖర్జూర, ద్రాక్ష ఉద్యానములు, జైతూన్ అను వృక్షములును, కలసిమెలిసి యుండు దానిమ్మలు గలవు ఫలముం వైపు చూడుము ! అవి ఫలించినపుడు, ఫలించుచున్నప్పుడు చూడుము ! శ్రద్ధగలవారికి వీనిలో నిస్సందేహముగా (ఈశ్వరీయ) సంకేతములు గోచరించగలవు. 6_95-99

## 51. సృష్టికృతి యొక్క సమయ పత్రము

1. చెప్పు : ఏమి ! 'మీరు రెండు దినములలో భూమిని సృష్టించిన ఈశ్వరుని తిరస్కరించెదరా ? అతనికి ఎవరినో సమకక్షులను చేసెదరా ? ఇతడే విశ్వమంతటికి ప్రభువు.

2. మరియు అతడే భూమిపై పర్వతములను కల్పించెను. దానిలో విపులతను చేకూర్చెను. ఇంకను అర్థించు వారికి వలయు పంటను నాలుగు దినములలో సమతూకాడు ప్రణాళికను సిద్ధపరచెను.

3. పిమ్మట ఆకాశమువైపు చూడగా అది ధూమమయమై యుండెను. అపుడు భూమ్యాకాశములను ప్రసన్నతా ప్రసన్నతలు చూడకుండా రమ్మనెను. ఉభయులు ప్రసన్నతతోనే వచ్చితిమని చెప్పిరి.

4. రెండు దినములలో వానిని ఏడు ఆకాశములుగా రూపొందించి ప్రతి ఆకసమున తన ఆజ్ఞను అతడు ప్రతిష్ఠితమొనర్చి, సమీపము నందుగల ఆకాశమును దీపములచే అలంకరించి సురక్షిత పర్చెను. ఇది సర్వజితుని, సర్వజ్ఞుని రచనాక్రమము. 41-9-12

## 52. అగ్ని - నీరు - అన్నముల నిర్మాత

1. ఏమి ! మీరు చల్లే విత్తనముల గురించి ఆలోచించితిరా !
2. ఏమి ! వాటిని పెంచునది మీరా ? లేక మేమా ?
3. మేము తలచుకొన్నచో వాటిని పొలు - పొల్లుగా చేయగలవారము. అపుడు మీరు (క్రింది) పొల్లుమాటలతో ఉండిపోయేవారు.
4. మేము నష్టపడితిమిగదా !
5. మేము వంచితులమై పోయితిమి.
6. ఏమి ! మీరు త్రాగే జలము గురించి ఆలోచించితిరా ?
7. మేఘముల ద్వారా నీటిని తెప్పించినది మీరా ! లేక మేమా ?
8. మేము తలంచినచో నీటిని ఉప్పగా చేసి ఉంచేవారము. అయినపుడు మీరెందుకు కృతజ్ఞులుగారు ?
9. ఏమి ! మీరు రగుల్చుకొను అగ్ని గురించి ఆలోచించితిరా ?
10. అగ్నికొరకు వృక్షములనుత్పత్తి చేసినది మీరా ? లేక మేమా ?
11. ఉపదేశము కొరకు, యాత్రికుల మేలుకొరకు మేమే వృక్షములను సృజించితిమి.

2. అందుచే నీవు ఆ ప్రభు సత్త్రముని నామజపము చేయుచుండుము.
56-63-74

**3. విశ్వాధారుడు**

. ఏమి! రెక్కలు విప్పుకొనుచూ, ముడుచుకొనుచూ ఆకసమున తిరుగుచున్న పక్షులను వారు చూడలేదా? కృపాళువు తప్ప మరెవరు ఆ పక్షులను పట్టి యుంచగలరు? నిస్సందేహముగా అతడు ప్రతి వస్తువును నిరీక్షించువాడై యున్నాడు. 69-67-19

## 12. ఈశ్వరుని సుందర సృష్టిరచన

### 54. క్రమబద్ధమైన రచన

. సర్వాధికారముగల అతడు మంగళ ప్రదుడు మరియు సర్వకర్మ సమర్థుడు.

2. మీలో ఎవరు ఆచరణలో అధిక శ్రేష్ఠులో పరీక్షించుటకు (అతడు) జీవన్మరణములను కల్పించెను. అతడు సర్వాధికుడు. క్షమించు వాడై యున్నాడు.

3. అతడు ఒకటిపైనొకటిగా (అంతస్థులుగా) ఏడు ఆకాశములను నిర్మాణము చేసెను. కృపాళుని రచనలో నీవు ఏ చిన్నపాటి లోపమును చూడలేవు. తిరిగి నీ దృష్టిని రెండవసారి ప్రసా దించుము. నీ కెచటనైనను చిన్న పగులు కనిపించుచున్నదా?

4. మరి, పదేపదే దృష్టి నిగిడించుము. నీ దృష్టియే అలసి, స్తంభించి తిరిగిరాగలదు. 67-1-4

### 55. ప్రభునిర్మిత సుందర జగత్తు

1. ఏమి! మేము భూమిని పడకవలె నిర్మించలేదా?

2. మరియు పర్వతములను మేకులుగా,

3. మేము మిమ్ముల జంటలు-జంటలుగా జేసి పుట్టించితిమి.

4. మరియు మేము మీ నిద్రను విశ్రాంతికి సాధనముగాను,

5. రాత్రిని తెరగాను చేసితిమి.

6. దినమును, ఆర్జనకు అనువుగా నుండునట్లు నిర్మించితిమి.

78-6-11

## 56. ఒంటె మొదలగువాని సృష్టి చమత్కృతి

1. ఏమీ! వారు ఒంటెలు ఎట్లు నిర్మించబడినవో చూచుటలేదా?

2. మరియు ఆకాశము వైపు, (చూడుడు) అదెట్లు సమున్నతముగా చేయబడి యున్నది?

3. పర్వతములవైపు, (చూడుడు) అవి ఎట్లు పాతబడి యున్నవి?

4. భూమి వైపు, అది ఎట్లు పరచబడి యున్నది? 88-17-20

## 57. నిగూఢమునందు బుద్ధినుపయోగించకుడు

1. మేము ఆకాశప్రపంచమును తారలచే భూషించితిమి.

2. మరియు దానిని విద్రోహియగు సైతాన్ బాడి నుండి సురక్షిత మొనర్చితిమి.

3. వారు ఆ ఉన్నత సభాస్థలివైపు తమ వీనుల నుంచలేరు. మరియు వారిని నెట్టివేయుటకై నలువైపులనుంచి అగ్నికణములు విసరి వేయబడుచుండును.

4. వారికి సదా దండనయే గలదు.

5. కాని, వారు తటాలున ఊడిపడి ఎగిరి తన్నుకొని పోయినపుడు వేధించే జ్వాల యొకటి వారికి తగులుచుండును. 37-6-10

. ఒకే జలముచే వివిధములగు ఫలములు

భూమి మీద దగ్గర దగ్గరగా గల ఖండములు అనేకములున్నవి. వృక్షముల ఉద్యానములు, పంటచేలు, ఖర్జూర వృక్షములు గలవు. ఆ వృక్షములు, వేర్లను కలసియు, వేరుగాను గలవు. ఒకే నీరు వాటన్నిటికి ఇవ్వబడుచుండును. అయినను ఫలములలో మేము ఒకదాని కంటె ఒకటిని పెద్దదిగా చేయుచున్నాము. బుద్ధిమంతులకు వీనిలో ఈశ్వరీయ సంకేతములు గలవు. 13-4

## 9. ఈశ్వరీయ చిహ్నములు

. మిమ్ముల మట్టితో పుట్టించుట అతని చిహ్నము. పిమ్మట మీరు మానవులై భూమిమీద నలువైపులా వ్యాపించి పోయితిరి.

. మీరు విశ్రాంతి పొందుటకు మీ జాతివారిచే, మీరు జంటలుగా సృజింపబడుట అతని చిహ్నమే. మీలో ప్రేమ, కరుణ ఉత్పన్నము చేయబడినవి. నిస్సందేహముగా చింతనము చేయువారికి వీనిలో సంకేతములున్నవి.

3. ఆకాశములు, భూమియొక్క సృష్టి, మీ భాషావేషములు వేరు వేరుగా ఉండుట అతని చిహ్నమే. నిస్సందేహముగా బుద్ధి మంతులకు వానిలో తగిన సంకేతములున్నవి.

4. దినమందు, రాత్రులందు మీరు పోయే నిద్ర మరియు మీరు అతని కృపావైభవాన్ని అన్వేషించుటయు అతని చిహ్నములోనివి. నిస్సందేహముగా అవలోకించు వారికి వీనిలో సంకేతములు గలవు.

5. మీకు విద్యుత్తును చూపించి ఆశాభయములు కలుగజేయుట మరియు ఆకాశము నుండి నీటిని రప్పించుట, ఆ నీటిచే నిర్జీవమైన భూమిని

సజీవము చేయుట, అతని చిహ్నములోనివి. నిస్సందేహముగా బుద్ధిమంతులకు వీనిలో సంకేతములున్నవి.

6. భూమ్యాకాశములు అతని ఆజ్ఞచే స్థిరబడియుండుట అతని చిహ్నము. అటులనే మిమ్ము పిలిచి భూమి నుంచి రమ్మనుటతో తక్షణమే మీరు వెడలివచ్చుచున్నారు.

## 60. ఈశ్వరుడు ఛాయా నిర్మాత

1. మన ప్రభువు నీడను ఎట్లు వ్యాప్త మొనరించెనో నీవు గమనించుట లేదా ? అతడు తలచినచో దానిని ఆపి ఉంచగలడు. కాని మేము ఆ నీడకు సూర్యుని మార్గదర్శకునిగా చేసితిమి.

2. పిమ్మట, మేము దానిని నెమ్మది-నెమ్మదిగా లాగుకొంటిమి.
25-45-46

## 61. ఈశ్వరుడు నానా రంగుల నిర్మాత

1. ఏమి ! ఈశ్వరుడు ఆకాశమునుండి నీటిని రప్పించినది నీవు చూడలేదా ? ఆ నీటిచే మేము పలురంగుల ఫలములను ప్రభవింప జేసితిమి. తెల్లని, నల్లని, ఎఱుపు రంగుల పర్వతశ్రేణులు గలవు.

2. ఇట్లే మనుజులు, పశువులు, వన్యమృగములలో అనేక వర్ణములు గలవు. ఈశ్వరుని దాసులలో ఎఱిగిన వారలే అతని నుంచి భయపడుదురు. నిస్సందేహంగా ఈశ్వరుడు సర్వశక్తిమంతుడు. మరియు క్షమాశీలుడై యున్నాడు. 37-27-28



# 7. సర్వశక్తి

## 14. సర్వశక్తిమంతుడు

### 62. సర్వాధిపతి

1. చెప్పు : ఈ భూమియు దానిలోగల వాటిని ఎవరు రచించిరి. నీవు ఎరుగుదువా ?

2. వారు తప్పక ఈశ్వరునిదే యని చెప్పగలరు. అయినపుడు చెప్పు, మీరెందుకాలోచించరు ?

3. చెప్పు : సప్తాకాశములకు ప్రభువు, మహోన్నత సింహాసనాధిపతి ఎవరు ?

4. సర్వము ఈశ్వరునిదేనని వారు తప్పక చెప్పుదురు. అయినపుడు చెప్పు : వారేల భయపడరు ?

5. చెప్పు : ప్రతి వస్తువుపై అధికారము ఎవరి హస్తగతమైయున్నది? ఆశ్రయమిచ్చు వారెవరు ? అతనికి ప్రతికూలముగా రక్షణ ఇవ్వగలమా ?

6. వారు ఇదంతయు ఈశ్వరునిదే యని తప్పక చెప్పెదరు. చెప్పు : అయినప్పుడు మిమ్ములను ఏ మాయ వచ్చి ఆవరించుచున్నది ?

23-84-89

### 63. ప్రళయకారుడు

1. ఈశ్వరుడెంతటి వాడో మీరు అర్థము చేసుకొనుటలేదు. ప్రళయ కాలమందు. (పునరుత్థాన దినమందు) భూమి సర్వము అతని

పిడికిటిలో నుండ గలరు. ఆకాశము అతని కుడి హస్తమును చుట్టబడియుండును. వారు నిర్ధారణ చేయు భాగస్వాములకంటె (అన్యదేవతలకంటె) అతడు పవిత్రుడు, మరియు విలక్షణుడు.
39-67

## 64. అతడు సృష్టి స్థితిలయకర్త

1. ఆ ప్రభుసత్తముని నామమును జపిస్తూ, జయగానము చేయుము.
2. ఎవడు రచన చేసెనో మరియు ఎవడు సరిచేసెనో.
3. ఎవడు అంచనా వేసెనో మరియు మార్గమును చూపించెనో
4. ఎవడు తృణగ్రాసములను, ఉద్భవింపజేసెనో.
5. పిమ్మట, వానిని ఎవడు ధ్వంసము చేసెనో. 87-1-5

## 65. పునరుత్థాపన సమర్థుడు

1. మేము మానవుని ఒక జీవ బిందువుచే నిర్మాణము చేసితిమని, అతడు ఆలోచించుటలేదు. అందువల్ల అతడు అకస్మాత్తుగా తగవుల మారినవాడయ్యెను.

2. మరియు మమ్ముగురించి విచిత్రపు మాటలను నుడువుచు, తన పుట్టుకను విస్మరించి చివికిపోయిన ఎముకలను జీవింప జేయు వాడెవడని పలుకుచున్నాడు ?

3. చెప్పు : వారిని తొలిసారి పుట్టించినవాడే తిరిగి జీవింపజేయగలడు. అతడు అన్ని విధముల ఉత్పత్తి చేయుటను ఎరుగును.

4. అతడే మీకొరకు పచ్చని చెట్లనుండి అగ్గిని నిర్మాణము చేసెను, ఇపుడు మీరు దానిచే నిప్పును రగుల్చుకొనుచున్నారు.

5. ఏమి ? ఆకాశములను మరియు భూమిని నిర్మాణము చేసినవాడు వారివంటి వారిని (ఆ ప్రజలవంటి వారిని) సృష్టించుటకు సమర్థుడు కాడా ? ఎందుకు కాడు ? అతడే సృష్టికర్త సర్వజ్ఞుడు.

6. అతడు సంకల్పించిన వస్తువును "అయిపోవుము" అనుటతో ఆ వస్తువు సిద్ధమగుచున్నది. ఇదే అతని శాసనము.

7. సర్వ వస్తువులపై అధికారముగల అతడు పవిత్రుడు, అతనివైపే మీరందరు మరలిపోవలసి యున్నది. 36_77_83

# 15. ఇచ్ఛా సమర్థుడు

## 66. పుత్ర పుత్రికాదాత

1. ఆకాశములలో, భూమి మీదను ఈశ్వరుని ఆధిపత్యము గలదు. అతడు సంకల్పమాత్రముననే దానిని సృష్టించెను. మరియు ఇష్టమున్న వారిలో కొందరికి పుత్రికలను, కొందరికి పుత్రులను ఇచ్చుచున్నాడు.

2. లేక, కొందరికి పుత్రీ, పుత్రుల నిద్దరిని ఇచ్చుచున్నాడు. తాను కొందరిని నిస్సంతులను గావించుచున్నాడు నిస్సందేహంగా అతడు విజ్ఞాన ఘనుడు, సమర్థుడు. 42_49_50

## 67. కళ్యాణము నీ హస్తగతము

1. చెప్పు : ఓ, ఈశ్వరా, సర్వాధి పతీ ! నీ యిష్టమున్న వారికధికారము నిచ్చుచున్నావు మరియు ఇష్టమున్న వారినుండి అధికారమును లాగుకొనుచున్నావు. ప్రతిష్ఠా ప్రతిష్ఠలు నీ యిష్టమున్న

వారికి కలుగజేయుచున్నావు. కళ్యాణమంతయు నీ హస్తగతమై యున్నది. నిస్సందేహముగా నీవు సర్వకర్మ సమర్థుడవు.

## 68. ఈశ్వరుని కంటే భిన్నముగా జీవునకు స్వాతంత్ర్యము లేదు

1. నీ ప్రభువు తనకిష్టులగు వారిని పుట్టించుచున్నాడు. మరియు యెన్ను కొనుచున్నాడు. ఆ విషయమందు జీవులకు ఏమాత్రము స్వాతంత్ర్యము లేదు. ఈశ్వరుడు పవిత్రుడు మరియు వారి కల్పిత భక్తి కంటె అతీతుడు.

## 69. ఎవరు ఈశ్వరుని కోరుదురో, వారికే లభ్యుడు

1. చెప్పు : వైభవమంతయు నిశ్చయముగా ఈశ్వరుని హస్తగతమై యున్నది. దానిని అతడు తన కిష్టులకు ప్రసాదించుచున్నాడు. ఈశ్వరుడు సర్వవ్యాపకుడు, సర్వజ్ఞుడు. మరియు ఈశ్వరుడు గొప్ప వైభవశాలి. 3-73-74

## 70. ఈశ్వరానుజ్ఞలేనిది శ్రద్ధలభించదు

1. ఈశ్వరానుజ్ఞ లేనిది యెవరికైనను శ్రద్ధభించుట అసంభవము. బుద్ధినుపయోగించనివారిని అతడు అశుచిత్వములో పడవేయును- 10-3

## 71. ప్రభువు కృపయొక్క మాహాత్మ్యము

1. ఈశ్వరుడు ఋజుమార్గమును చూపదలచుకొన్న వారి హృదయ ద్వారములను శరణ్యతకై తెరచుచున్నాడు. మరియు మార్గ భ్రష్టులుగా ఉంచదలచుకొన్నవారి హృదయములను మిక్కలి సంకుచితపరచి వేయుచున్నాడు. ఆ మనుష్యుడు బలవంత

ముగా ఆకాశము మీదికి ఎక్కినట్టగును. ఈ విధముగా శ్రద్ధలేని వారికి అపయశస్సును కలిగించుచున్నాడు. 6-125

## 16. అవర్ణనీయుడు మహనీయుడు

### 72. ఈశ్వరీయ సింహాసనము

1. ఈశ్వరుని కంటె వేరైన నిర్గంత లేదు. అతడు శాశ్వతుడు. స్థిరుడు. అతనికి నిద్ర రాదు. కూర్పాట్లులేవు. ఆకాశములు, భూమిలో గల సర్వము అతనిదే. అతని అనుజ్ఞలేనిది సిఫారసు ఎవరు చేయగలరు? వారల ముందు, వెనుక గలదంతయు అతదెరుగును. అతనికి ఇష్టమున్నప్పుడే తప్ప అతని ప్రజ్ఞ నుంచియే అంశము, ఎవరూ తమ పరిధికి తెచ్చుకొనజాలరు. అతని సింహాసనము భూమి, ఆకాశములను వ్యాపించుకొని యున్నది. ఆ రెంటి పోషణభారము వహించుటలో అతనికి అలసటరాదు. అతడు శ్రేష్టతముడు, మహనీయుడు 2-250

### 73. ఈశ్వరుని వర్ణన సముద్రము సిరా అయినను చాలదు

1. చెప్పు: నా ప్రభువు మాటలు వ్రాయుటకు సముద్రము సిరా అయినను, నా ప్రభువు గుణవర్ణన సమాప్తమగుటకు పూర్వమే ఆ సముద్రము (సిరా) సమాప్తమగును వ్రాయు సిరాగా వేరొక సముద్రము సహాయపడినను సరిపోవదు. 18-109

### 74. వృక్షములన్ని లేఖినులైనా—

1. భూమిపైగల వృక్షములన్నియు లేఖినులై, సిరా సప్త సముద్రములు మరి యింకను ఏడుగా అయినను ఈశ్వరుని గుణ వర్ణన సమాప్తము కాజాలదు. నిస్సందేహముగా పరమాత్మ సర్వ జితుడు. సర్వవిదుడు. 31-27

—:o:—

# 8. నామ స్మరణము

## 17. ఈశ్వరుని నామము

### 75. ఈశ్వరుని కొరకు సుందరనామములు

1. నరకగాములు, స్వర్గగాములు సమానులు గాజాలరు. స్వర్గ ప్రాప్తికి అధికారమును పొందినవారు విజయులు.

2. ఒకవేళ ఈ కురానును ఏదేని పర్వతము మీదుగా అవతరింప జేసినచో, ఆ పర్వతము ఈశ్వరుని భయముచే అణగి, పగిలి పోవుట నీవు చూచెడివాడవు. మేము ఈ దృష్టాంతములను ప్రజల ముందు ఆలోచించుటకు పెట్టుచున్నాము.

3. ఆతడే ఈశ్వరుడు. అతనికి మించిన వేరొక నియంత లేడు అతడు వ్యక్తావ్యక్తముల పరిజ్ఞాత. అతడు మహాకృపాలుడు, అనంత కరుణానిధి.

4. అతడే ఈశ్వరుడు. అతడు తప్ప వేరొక నియంత లేడు. అతడు సర్వసత్తాధిపతి. పవిత్రతముడు. సంరక్షకుడు. శరణ్యుడు, శాంతిదాత, సర్వజితుడు, బలవంతుడు మరియు మహోత్తముడు. వారు నిర్ధారించుచున్న భాగస్వాములకన్న వేరైనవాడు. (విలక్షణుడు.)

5. అతడే ఈశ్వరుడు. కర్త, భర్త, స్వరూపదాత. సుందర నామము లన్నియు అతనివే. ఆకాశములలో భూమిలో గల సర్వము అతనిని జపించుచు, జయగానములు చేయుచున్నవి. అతడు సర్వవిజయి, సర్వవిదుడు. 59-20-24



# 9. సాక్షాత్కారము

## 18. సాక్షాత్కారము

### 76. మూసాకు సాక్షాత్కారము (ప్రభువు చెప్పెను)

1. మేము మూసాకు ముప్పది రాత్రుల మాటఇచ్చి, మరి పదిరాత్రులు హెచ్చించితిమి. ప్రభువు పెట్టిన నలుబది రాత్రుల గడువు పూర్తి కాగానే, మూసా తన సోదరుడగు హారూనుతో "నీవు సమాజ మందు నా ప్రతినిధివై కార్యకలాపములను, నిర్వహించు చుండుము. విద్రోహుల మార్గమును అనుసరించకు"మనిచెప్పెను.

2 మేము నియమించినసమయముకు మూసారాగాప్రభువుగా అతనితో సంభాషించెను. అపుడు "ఓ నా ప్రభూ! నీకు నాకు దర్శన మిమ్మనినుడివెను వలెను. మూసా! "నీవు నన్ను ఎట్టిపరిస్థితు లలోనూ చూడజాలవు. నీవు పర్వతము వంక చూడుము. ఒకవేళ పర్వతము తన స్థానమందున్నచో నీవు నన్ను చూడగల్గుదు"వని ప్రభువు చెప్పెను. పిమ్మట ప్రభువు తన తేజస్సును పర్వతముపై ప్రసరింపచేయగా, కొండ చూర్ణమై మూసా మూర్చితుడయ్యెను. తిరిగి స్పృహరాగా "నీవు పరమ పవిత్రుడవు నీకు జయమగు గాక! నేను పశ్చాత్తాపతప్తుడనై నీ శరణు జొచ్చితిని. నేను శ్రద్ధావంతులలో మొదటి వాడ"నని మూసా నుడివెను.

3. ఓ మూసా! నా సందేశములను, నా వార్తాలాపములను ప్రజలకు వినిపించు విశిష్టత నీకు కలుగ జేసితిని, కాబట్టి నేను నీకు ప్రసాధించినది గ్రహించి కృతజ్ఞులలోని వాడవు కమ్మని ఈశ్వ రుడు ఆనతిచ్చెను.

4. మేము మూసాకు కలప పలకలమీద ప్రతి విషయము గురించి ఉపదేశములును, ప్రతి వస్తువు యొక్క విస్తార వర్ణన వ్రాసి ఇచ్చితిమి. ఈ సంగ్రహమును భద్రముగా ఉంచుమని, వానిలోని ఉత్తమసారమును గ్రహించి, ఆచరించుటకు తన సమాజమునకు ఆదేశమిమ్మని చెప్పితిమి. 7-142-145

## 77. మూసాకు సాక్షాత్కారము (అగ్నిజ్యోతి దర్శనము)

1. ఏమీ! మూసా కథనము మీకు అందినదా?

2. ఆయన ఒక అగ్నిజ్వాలను చూచి తన ఇంటివారలతో ఇట్లనుడు, నిశ్చయముగా నేను ఒక అగ్నిజ్వాలను చూచితిని. ఆ జ్వాల నుంచి మీకు ఒక అగ్నికణమును తేగలను. లేక అగ్ని దగ్గరకు వెళ్ళగల మార్గమును అన్వేషించగలనని చెప్పెను.

3. పిమ్మట (అగ్ని) దగ్గరకు వెళ్ళగా "ఓ మూసా" అను పిలుపు వచ్చెను.

4. "నిస్సందేహముగా నేను నీ ప్రభువును, నీవు "తవా" యను పుణ్య క్షేత్రములో యున్నావు. గాన నీ పాదరక్షలు విడువుము."

5. నేను నిన్ను ఎన్నుకొంటిని. నీకు ప్రసాదించబడు ప్రజ్ఞానమును శ్రద్ధగా వినుము"

6. "నిస్సందేహముగా నేను పరమాత్మను నేను తప్ప సేవింపదగిన వాడు వేరొకడు లేడు. కనుక నన్ను భక్తితో సేవింపుము. నా స్మరణతో నిత్యము నన్ను ప్రార్థన చేయుచుండుము. 20-9-14

## 78. మహమ్మదుకు సాక్షాత్కారము

1. ఒరిగిన నక్షత్రములతో శపథము.

2. నీ సహచరుడు భ్రమ పడలేదు దారి తప్పలేదు.

3. మరియు వాడు వాసనాయుక్తముగా మాట్లాడుట లేదు.

4. పంపబడినది ఈశ్వరీయ జ్ఞానము.

5. ఈ జ్ఞానమును గొప్ప శక్తిశాలి ప్రబోధించెను.

6. అతడు గొప్పశక్తిశాలి, పూర్ణరూపమున ప్రకటిత మయ్యెను.

7. అతడు ఆకాశము యొక్క ఉన్నతక్షితిజముపై నుండెను.

8. ఇంకను అతడు సమీపించెను. మరల కొంతవరకు దిగి వచ్చెను,

9. రెండు ధనస్సుల అంతరములో నుండెను. లేక ఇంకను సమీప మునకు వచ్చెను.

10. పిమ్మట తన దాసునికి ఈశ్వరీయ జ్ఞానము పంపెను. పంపబడినది ఈశ్వరీయ జ్ఞానమే.

11. దర్శించిన దంతయు మిధ్యకాదని హృదయమునకు తెలియ వచ్చెను.

12. అయితే అతడు దేనిని దర్శించెనో దాని గురించి మీరు అతనితో తగవులాడెదరా ?

13. మరియు అతడు అతనిని అవతరింపజేయుచుండగా మరొకసారి చూచెను.

14. చివరి హద్దున గల రేగుచెట్టు సమీపమునందు.

15. అతని వద్ద సౌఖ్యదాయక మగు స్వర్గముండెను.

16. అపుడు ఆ బదరీ వృక్షము తేజోమయమై యుండెను. అది సదా తేజోమయమై యుండునదే.

17. ఆ సమయమున అతని దృష్టి తగ్గనులేదు. హెచ్చును లేదు.

18. నిశ్చయముగా అతడు తన ప్రభువుయొక్క మహత్తర చిహ్న
ములను దర్శించెను. 53-1-18

## 79. త్రివిధ సాక్షాత్కారము

1. ఏ మానవునికి ఈశ్వరునితో మాటాలాడుటకు అనుగ్రహము లభించదు. కాని,

1. ప్రజ్ఞానము ద్వారా
2. తెరచాటు నుండి
3. పరమాత్మని యాజ్ఞచే అతని ఇచ్ఛానుసారము పంపబడిన సందేశము ద్వారా. నిశ్చయముగా ఈశ్వరుడు సర్వోచ్చుడు, సర్వవిదుడు.

2. ఇదే ప్రకారము మేము మా యాజ్ఞతో మీవైపు ప్రజ్ఞానమును పంపితిమి. నీకు గ్రంథమన్న ఏమిటో, శ్రద్ధ దేనినందురో తెలియదు. అయితే మేము దీనిని మా ఇష్టముగల దాసులకు మార్గదర్శకమగునట్లు ప్రకాశవంతము చేసితిమి. నిస్సందేహముగా లోకులకు నీవు చక్కని మార్గమును చూపించగల వాడవు.

3. ఆకాశములోను, భూమిలోను గలవారికి ఆయీశ్వరీయ మార్గము. జాగ్రత్త ఈశ్వరుని వైపే అన్ని కార్యములు ప్రవృత్తము లగును.
42-51-53

## 80. జ్ఞానములో ఒకరాత్రి సహస్రమాన జీవనము

1. మేము కురానును మంగళప్రదమగు రాత్రియందు అవతరింప జేసితిమి.

2 ఆ మంగళప్రదమగు రాత్రియన్న ఏమిటో మీరు ఏమి గ్రహించితిరి?

3. ఆ రాత్రి వేయిమాసములకన్న ఉత్తమమయినది.

4. ఆ రాత్రి యందు ప్రభువు ఆజ్ఞతో దేవదూతలు, జీవులు, ప్రత్యేకముగా తమ కార్యములకొరకు దిగివచ్చుచున్నారు.

5. అరుణోదయము వరకు ఆ రాత్రి కరుణామయము శరణ్యదాయకమై యున్నది. 97-1_5

## 81. జ్ఞానప్రాప్తికి త్వరపడకుడు

1. ఈశ్వరుడుపరమోన్నత పదమందున్నవాడు. వాస్తవముగా అతడు రాజరాజేశ్వరుడు. కాన నీవు ఖురాను గురించి, దాని అవతరణ పూర్తిఅయ్యే వరకును త్వరపడకుము—

ఓ ప్రభూ: నన్ను జ్ఞానవృద్ధుని చేయుము— (అనుము)20-114



ప్రార్థన

# 19. ప్రార్థన

## 82. శరణ్యత

1. ఓ, భూమి ఆకాశముల నిర్మాతా! నీవే ఇహపరలోకములలో నాకు సంరక్షక మిత్రుడవు. శరణాగత దశలో నాకు మృత్యువు నిమ్ము - మరియు నన్ను సాధువులగు నీ భక్తులలో చేర్చుకొనుము.
12-101

## 83. కృతజ్ఞత

1. ఓ, నాప్రభూ! నాకు, నా తలిదండ్రులకు నీవు కటాక్షించి ప్రసాదించిన వరదానములకు కృతజ్ఞత తెల్పు శక్తి నిమ్ము. మరియు నీ కిష్టమగు సత్కార్యములు చేయునట్లు నన్ను కరుణించు. మరియు నీకృపను చూపి, పుణ్యచరితులగు నీభక్తులలో నను చేర్చుకొనుము. 27-19

## 84. సంకట విమోచనము

1. చెప్పు : ఉషఃకాలప్రభువును రక్షణ కొరకు నేను ఆశ్రయించుచున్నాను.
2. అతడు సృష్టించిన వస్తువులలోగల దుష్టత్వము నుండి,
3. మరియు వ్యాపకమగు అంధకారములోని దుష్టత్వము నుండి,
4. గ్రంథులలో ఊదువారి దుష్టత్వము నుండి,
5. ఈర్ష్య కలుగచేయు, ఈర్ష్యాళువుల దుష్టత్వము నుండి, 113-1-5

## 85. వికార విమోచనము

1. నేను, మానవుల ప్రభువుయొక్క ఆశ్రయమును కోరుచున్నాను.
2. అతడు ప్రజల సత్తాధీశుడు.
3. మానవులకు భజనీయుడు.
4. చెడు ప్రేరణ కల్గించువారినుండి, మరియు వెనుకకు లాగివేసే వారి దుష్టత్వము నుండి (రక్షణకు)
5. మానవుల హృదయములతో వికారత కల్పించు వారి నుండి (రక్షణకు)
6. అట్టివారు జినులలోనివారయినను లేక మనష్యులలోని వారయినను (సరే) 11-4-16



# తృతీయ ఖండము

## భక్తి రహస్యము

## III. భక్తి

## 20. ప్రార్థనోపదేశము

### 86. సప్త విధములు

1. ఓ, ఆచ్ఛాదితుడా !
2. లెమ్ము, మరియు ప్రజలను మేలు కొలుపుము.
3. ఇంకను నీ ప్రభువు యొక్క మహిమను చాటుము.
4. నీ మనసును శుద్ధముగా నుంచుకొనుము.
5. మరియు అశుచి నుండి దూరముగా నుండుము.
6. ఎక్కువ ప్రత్యుపకారము కొరకు ఉపకారమును చేయకుము.
7. మరియు నీప్రభువుకై ఓపిక కల్గియుండుము. 74-1_7

### 87. ప్రార్థనకై రాత్రికి గల మహత్తు

1. ఓ, దుప్పటి కప్పుకొన్నవాడా !
2. రాత్రిళ్ళు లేచి ఉపాసన చేయుము. కాని కొంచెము సమయము మాత్రమే.
3. అర్థరాత్రియందుగాని, అంతకు పూర్వము ముందుగాని.
4. లేక అంతకు మించిగాని కురాన్‌ను సుస్పష్టముగా పఠనచేయుము.

నిస్సందేహముగా మేము నీపై గొప్ప భారము వేయుచున్నాము.

. నిస్సంశయముగా వాసనాక్షయమునకు రాత్రివేళ లేచుట ఎక్కువ తేజో వంత మయినది. అది వాక్కును సరళమొనర్చుచున్నది.

. నిస్సందేహముగా నీకు పగటివేళ పనులనేకముగా నుండును

నీ ప్రభువు నామమును ఉచ్చరించుము. మరియు అందరి నుండి వేరై అతని వైపు ప్రవృత్తుడవు కమ్ము.

. అతడు పూర్వ, పశ్చిమములకు స్వామి. అతడు తప్ప ఇతరు లెవ్వరును భజనీయులు లేరు. కావున అతనినే నీవు సంరక్షకునిగా చేసికొమ్ము.

0. మరియు శ్రద్ధాహీనుల మాటలను సహిస్తూ, వారిని మంచి మాటలతో విడనాడుము. 73-1-10

## 38. సంయమముగల వాక్కుచే ప్రార్థన చేయుము

. కురాన్ పఠనము చేయునపుడు ఆ పఠనమునందు తన్మయుడవై మౌనముగా నుండుము. దానివలన ఈశ్వరుని కృప కలుగును.

2. మరియు నీప్రభువును నమ్రతా భయములతో సంయమ మగు వాక్కుతో ప్రాతః సాయములందు స్మరించుచుండుము. అసావ ధానుడవు గాకుము.

3. నిస్సందేహముగా నీప్రభువు సన్నిహితులగు వారు భక్తిపరులగుట లోను, అతనిని సేవించుటలోను అహంకార పడరు. వారు అతని జపమును జయజయ గానమును చేయుచు ప్రణతులర్పించు చుందురు. 7-204-2 6

## 89. ఈశ్వరుడనుము లేక దయామయుడనుము

1. చెప్పు : అల్లా (ఈశ్వరుడు) అనుము. దయామయుడనుము. ఏమని పిలిచినా, ఉత్తమ నామములన్నియు అతనివే. నీవు ప్రార్థన పెద్ద ధ్వనితో చేయకుము. అది గొణుగుకొనినట్లు ఉండ రాదు. మధ్యమార్గము అవలంబించుము. 17-110

## 90. క్షమాపణ

1, పరమాత్ముడు తప్ప అన్యులెవరును భజనీయులు లేరని తెలిసి కొనుము. నీ పాపముల కొరకును, శ్రద్ధావంతుల కొరకును, శ్రద్ధా వతుల కొరకును, ఈశ్వరుని క్షమాపణ వేడుకొనుము. పరమాత్మకు నీ నివాస స్థానము, నీ అంతిమ స్థానము తెలియును. 47-19

## 91. ప్రార్థన, వ్యాపారము మరియు క్రీడ

1. ఓ, శ్రద్ధావంతులారా ! శుక్రవారమునాడు ప్రార్థన కొరకు మిమ్ముల పిలిచినపుడు ఈశ్వర స్మరణకై పరుగెత్తుడు. క్రయ విక్రయాదులు మానుడు. మీరు తెలుసుకొన్నచో మీకిది ఉత్తమమైనది.

2. ప్రార్థన పూర్తికాగానే భూమిపై సాగిలబడి ఈశ్వరుని కృపా వైభవాన్ని అన్వేషించుడు. తన్మయులై ఈశ్వర స్మరణ చేయుడు. అందుచే మీకు కళ్యాణము చేకూరును.

3. వస్తు సామాగ్రి అమ్ముటను లేక వినోదమును చూచుటకు నిన్ను అచట విడిచి వారు పరుగిడుచుందురు. (వారితో) చెప్పు:

"వినోదము లేక వ్యాపారము కంటే ఈశ్వరుని చెంతగల వారు ఉత్తమోత్తములు, ఈశ్వరుడే శ్రేష్ఠమగు శక్తి నిచ్చువాడు." 62-1-11

## 92. ప్రార్థన కంటె స్మరణ గొప్పది

1. నీవైపు అవతరింప జేయబడిన గ్రంథమును పఠించుము. నిత్య నియమిత ప్రార్థన చేయుము. నిస్సందేహముగా ప్రార్థన అనుచితము, లజ్జాస్పదమగు మాటలను నిరోధించుచున్నది. ఈశ్వర స్మరణ అన్నిటి కంటె మహత్తు గలది. మీరు చేయున దంతయు ఈశ్వరుడెఱుంగును. 29-45

## 93 ఈశ్వర స్మరణచే అంతః సమాధానము

1. ఈశ్వర స్మరణచే అంతః కరణమునకు సమాధానము కలుగునని బాగుగా గుర్తించుము. 13-28

# 21. సృష్టి చేసిన ప్రార్థన

## 94. మేఘ గర్జన జపించుచున్నది

1. మేఘ గర్జన పరమాత్మని స్తుతితోపాటు అతనిని జపించుచున్నది. మరియు జయగానము చేయుచున్నది. దేవదూతలందరు ఆదరముతో అతనిని జపించుచూ, స్తోత్రము చేయుచున్నారు. 13-13

## 95. పక్షులు స్తోత్రము చేయుచున్నవి

1. భూమ్యాకాశములలో గల పక్షులు రెక్కలు విప్పుకొని పరమాత్మ నామస్మరణ చేయుటను నీవు చూడలేదా ! ప్రతియొకటియు తన పద్ధతి ననుసరించి ప్రార్థించుట ఎఱిగి యున్నది. వాని క్రియా కలాపములన్నియు పరమాత్మకు తెలియును. 24-41

## 96. సృష్టి జపము అగమ్యము

1. సప్తాకాశములును, భూమియును, దానిలోగల సకలమును అతనిని జపించును. అతని జయగానము చేయుచున్నవి. స్తుతితో బాటు జపము చేయని వస్తువేదియును లేదు. కాని వారి నామస్మరణ మీరు తెలుసుకొనలేరు. నిస్సందేహముగా అతడు ధృతిమంతుడు, మరియు కరుణా మూర్తి. 17-44

## 97. ఛాయా ప్రణతులు

1. భూమ్యాకాశములలో గల వన్నియు, స్వేచ్ఛతోగాని అయిష్టముతో గాని పరమాత్మకు ప్రణతులు చేయుచున్నవి. వాటి ఛాయా కూడ ఉదయ సాయంకాలంములందు అతనికి ప్రణతులు అర్పించుచున్నవి. 18-15

## 98. సృష్టి నమస్కారము

1. ఈశ్వరుడు ఏ వస్తువులు సృష్టించెనో, వాటి ఛాయలు కుడి, ఎడమల, పరమాత్మకు ప్రణతులొనర్చుచు సాగుచుండుటను మరియు అవి వినమ్రమైయుండుటను వారు చూచుట లేదా?

2. ఆకాశములు, భూమిలోగల ప్రాణులన్నియు మరియు దేవదూతలు పరమాత్మకు ప్రణమిల్లుచున్నారు. వారు గర్వించుటలేదు.

3. వారు తమపై అధిష్ఠితుడగు తన ప్రభువుకు భయపడుచు, అత ఇచ్చిన ఆజ్ఞలను పాలించుచుందురు. 16-48-70

9. సర్వసృష్టియు - మరి మనుష్యులలో కొందరును ప్రణమిల్లుచున్నారు

. ఏమీ ! భూమ్యాకాశములలో గలవి, సూర్యచంద్రులు, నక్షత్రములు, పర్వతములు, వృక్షములు, పశువులు మరియు మనుజులలో అధికులును పరమాత్మకు ప్రణతులర్పించు చుండుటను నీవు చూడలేదా ! 22-18

## 22. నిష్ఠ

### 100. శరణాగతి మరియు నైష్ఠికత

1. మాకు శ్రద్ధకలిగినదని చెప్పుకొను అజ్ఞానులతో చెప్పు : "మీ కింకను శ్రద్ధగలుగలేదు. కాని నేను శరణాగతిని స్వీకరించితిని ఇంకను శ్రద్ధ మీ మానసములలో ప్రవేశించలేదు. అయినను అతని దూత యొక్క ఆజ్ఞను పాలించినచో మీ సత్కర్మఫలమును లేశ మాత్రమును ఈశ్వరుడు తగ్గించడు. నిస్సందేహముగా ఈశ్వరుడు క్షమావంతుడు. మరియు కరుణానిధి."

2. ఈశ్వరుని యందు, అతని దూతయందు శ్రద్ధగలిగి, ఏ సంశయము లేక తమ ధన, మనః, ప్రాణములచే భగవన్మార్గమున పోరాడువారు శ్రద్ధాళువులు.

### 101. సాధన - శ్రద్ధ - సత్కృతి యను మూడు దృక్కోణములు

1. శ్రద్ధావంతులై సత్కార్యములు చేసిన వారు ప్రభుపరాయణులై శ్రద్ధకలిగి యున్నపుడు వారు చేయు భోజనము దోషయుతము

కాదు. ఇంకను ప్రభుపరాయణులై, పదే పదే పెక్కు సత్కార్య ములు చేయుచుండవలెను. సత్కార్య పరాయణులను ఈశ్వరుడు ప్రేమించును. 5-93

## 102. దేవుని కని సమర్పింతును

1. చెప్పు : నిస్సందేహముగా నా ప్రార్థన, నా భక్తి, నా జీవనము, నా మరణము పరమాత్మకొరకే. అతడు ప్రపంచమంతటికి ప్రభువు. 6-162

## 103. మనము ఈశ్వరుని వన్నెలో వన్నెగాంచ్లము

1. ఈశ్వరుడే మనకు వన్నెనిచ్చెను. మరి వన్నె తీర్చుటలో ఈశ్వ రుని కంటె శ్రేష్ఠు లెవరు? మేము అతనికే భక్తులము. 2-138

## 104. తండ్రి దేవుజేరుమనెడి తండ్రి, తండ్రి

1. ఓ శ్రద్ధావంతులారా! ఈశ్వరునిపై శ్రద్ధ కంటె, అతనిపై అశ్రద్ధను ప్రియతమముగా నెంచు మీ తండ్రిని. మీ సోదరుని, మిత్రునిగా ఎంచకుము. (వారిని) మిత్రు లనుకొనువారు దోషులు.

2. చెప్పు : మీ తండ్రులు, మీ పుత్రులు, మీ సోదరులు, మీ భార్యలు మీ పరివారము మరియు మీరు సంపాదించిన ధనము, మందగించు నేమో యని భయముగలిగించు మీ వ్యాపారము, మీకు నచ్చిన మీ యిండ్లు, ఇవన్నియు ఈశ్వరుని కంటె, అతని దూతకంటె మరియు అతని మార్గములో పోరాడుటకంటె, ఎక్కువ ప్రియమైనచో మీరు ఈశ్వరుని ఆజ్ఞ అగువరకు వేచి యుండుడు. ఈశ్వరుడు తన ఆజ్ఞలను అవహేళన చేయువారికి తన మార్గమును చూపించడు. 9-23-24

## 105. నమ్రత్వము గొప్పది

1. నిస్సందేహముగా మీలో అధికమగు నమ్రతకలవాడే పరమాత్ముని సన్నిధిని అందరికంటె గొప్పవాడు. ఈశ్వరుడు సర్వజ్ఞుడు, సర్వస్పర్శి. 49-13

## 106. ఈశ్వరేచ్ఛకు శరణు

1. ఏ విషయము గురించికాని నేను రేపిది చేయుదునని చెప్పకుము.

2. కాని "ఈశ్వరేచ్ఛ యున్నచో" అనుము.

## 107. భవనము దిబ్బమీదనా ! లేక క్రుంగిపోవు ఒడ్డుమీదనా !

1. ఈశ్వర ప్రసన్నత మీద, మరియు ధర్మపరాయణత మీద తన భవనము యొక్క పునాదులు వేయువాడు లాభపడునా ? లేక పతనోన్ముఖమైన తీరముమీద తన భవనముయొక్క పునాదులు వేయువాడా ? అతడు భవనముతోపాటు నరకాగ్నిలో దహించ బడి పోవుటకా ! 9-109

# 23. త్యాగము-సమర్పణము

## 108. ఉత్తమ వ్యాపారము

1. ఓ శ్రద్ధాళువులారా ! నేను మీకు దుఃఖదాయకమగు దండనము నుంచి (శిక్షనుంచి) మిమ్ము కాపాడగల ఉపాయము చూపించనా ?

2. పరమాత్మయందు, అతని దూతయందు శ్రద్ధయుంచుడు. మీధ ప్రాణములచే భగవన్మార్గములో పోరాడుడు. బుద్ధిమంతులగుచో ఇదే మీకు మంచిది. 61-10-11

## 109. శ్రేష్ఠమైన పుణ్యము

1. ఏమీ! నీవు యాత్రికులకు మంచినీరిచ్చువారిని, పవిత్రమగు మసీదులు కట్టించువారిని, అంతిమ దినముపై విశ్వాసముగల్గి భగవన్మార్గములో పోరాడు వారితో సమానులుగా ఎంచితివా? వీరలు ఈశ్వరుని సన్నిధిలో సమానులు కాజాలరు. ఈశ్వరుడు అన్యాయపరులకు దారిచూపడు.

2. శ్రద్ధావంతులై ఇండ్లు, వాకిండ్లు వదలి ధన, మనః, ప్రాణములతో భగవన్మార్గమున పోరాడువారు ఈశ్వరుని దృష్టిలో బహుశ్రేష్ఠులు. మరియు జయము పొందువారు కాగలరు. 9-19-20

## 110. సర్వోత్తమ సంచయము

1. ఓ శ్రద్ధావంతులారా! మీరు ఈశ్వరుని పట్ల అశ్రద్ధ చూపువారి వలె కాకుడు. పరదేశ ప్రవాసముకు లేక పోరాడుటకు వెళ్ళిన నీ సోదరుల గురించివారు నీ దగ్గర నున్నచో "చావరు, చంపబడరు" అని అనకుడు. ఈశ్వరుడు ఈ మాటలను చెప్పు వారిని దుఃఖకారకులుగా జేయును. ఈశ్వరుడు బ్రతికించువాడు, చంపించువాడు, మరియు ఈశ్వరుడు మీ పనులన్నియు చూచు వాడు.

. ఒకవేళ భగవన్మార్గములో చనిపోయినను లేక చంపబడినను, కాగలవేమియో ఈశ్వరుని కృపయు, క్షమయు, వారుసంపాదించిరి. అది విశ్వయొందిన ధనముకన్న శ్రేష్ఠమైనది.

3. వారు చనిపోయినను, చంపబడినను ఈశ్వరునిసన్నిధికి మీరందరు తప్పక చేర్చబడుదురు. 3-156-108

## 111. సర్వత్ర ఆశ్రయము

1. ఈశ్వర మార్గావలంబనలో తన జన్మభూమిని వదలిన వానికి ఈ విశాల భూమండలమందు కావలసినంత క్షేత్రము లభించును. ఎవడు తన యింటి నుంచి వెళ్ళి ఈశ్వరునివైపు, దూతవైపు పోవుచుండునో, మరియు ఆ సందర్భములో మరణము సంభవించెనచో దానికి లభించు ప్రతిఫలము ఈశ్వరాధీనమై యున్నది. ఈశ్వరుడు గొప్ప క్షమావంతుడు మరియు కరుణామూర్తి. 4-1^0

## 112. సద్గతి

1. ... ఎవరు జన్మభూమిని విడిచిరో. ఎవరు తమ ఇండ్లనుండి వెళ్ళగొట్టబడిరో మరియు నా మార్గములో కష్టపడిరో, పోరాడిరో, చంపబడిరో, వారి దోషములను నేను అవశ్యము తొలగించెదను. మరియు వారిని స్వర్గములో ప్రవేశపెట్టుదును. ఆ స్వర్గము క్రింద నదులు ప్రవహించుచుండును. ఇది ఈశ్వరునిచే లభించు ప్రతిఫలము మరియు మంచి ప్రతిఫలము ఈశ్వరుని చెంతనే గలదు. 3-1?5

## 113. ఉభయత్ర కళ్యాణము

1. అయితేసరి, ప్రపంచజీవితమును పరలోకము నిమిత్తము అమ్ముకొనువారే భగవన్మార్గములో పోరాడవలెను. భగవన్మార్గములో పోరాడువారు చనిపోయినా, చంపబడినా, జయించినా ఉభయపక్షములో వారికి, మేము గొప్ప పుణ్యఫలము నిచ్చుచున్నాము. 4-74

# 24. పరీక్ష మరియు ఆశ్వాసనము

## 114. పరీక్ష తప్పక జరుగును

1. శ్రద్ధగలవారమని అన్నంత మాత్రమున, వారు తమకు పరీక్ష జరుగదని తలచుచున్నారా? ఏమి?

2. మేము వీరికంటె పూర్వులను అవశ్యము పరీక్ష చేసితిమి. అట్లు చేయుటచే సత్యవంతులెవరో? అసత్యవంతులెవరో ఈశ్వరుడు గుర్తించగలడు. 29-23

## 115. పరీక్ష జరుగును

1. మీలో ఓపిక గలవారెవరో, పట్టుదలతో పోరాడువారెవరో మీ స్థితిగతులను పరిశీలించుటకు మేము మిమ్ములను తప్పక పరీక్షించెదము— 47-31

## 116. లేమిడి కూడా వరదానమే

(బీదతనము భక్తులకు వరదానము)

1. ఈశ్వరుడు తన భక్తులకు సంపదను అధికముగా సమకూర్చినచో వారు ప్రపంచములో దుమ్ము లేపెదరు. కావున అతడివ్వదలచినది తూచినట్లు అందించుచున్నాడు. నిస్సందేహముగా ఈశ్వరుడు తన భక్తులపై దృష్టిగల నిరీక్షకుడు. 47-25

## 117. సాధన మార్గములో ఈశ్వరుడు మార్గదర్శకుడు

1. మా కొరకై పోరాడు వారికి తప్పక (మేము) మా మార్గమును చూపించెదము. నిస్సందేహముగా ఈశ్వరుడు సత్కార్యములు చేయువారి వెంట ఉండును. 29-69

## 8. భక్తుల సాయమునకు ఈశ్వరుని ప్రతిజ్ఞ

మా భక్తులకు, దూతలకును నేను తప్పక సాయము చేయుదునని మొదటనే నేను చేసిన వాగ్దానము చేరినది. 37_171_172

## 9. సహాయము చేయువారికి సహాయము లభించును

ఓ శ్రద్ధావంతులారా? ఈశ్వరునికి మీరు సహాయపడుచో, అతడు మీకు సహాయము చేయును మరియు మీ అడుగులను స్థిరపరచును. 47_7

## 20. ఈశ్వరుడు సన్నిహితుడు

నా భక్తులు నిన్ను నా విషయమై ప్రశ్నించినపుడు, నేను సమీపమున నున్నానని చెప్పుము. మొర పెట్టుకొన్న వారి మొరను నేను ఆలకింతును. కావున వారు సన్మార్గులగుటకు నా ఆజ్ఞలను మన్నించవలెను. మరియు నాయందు శ్రద్ధయుంచవలెను. 2_286

## 21. బుద్ధియోగము ఇచ్చెదను

ఓ శ్రద్ధావంతులారా! ఈశ్వరుని యెడ, మీకుగల కర్తవ్యమును పూర్తిచేసినచో, అతడు మీకు వివేకమును, బుద్ధినిఇచ్చును. మీ దోషములను పారద్రోలి మిమ్ములను క్షమించును. ఈశ్వరుడు మహావైభవోపేతుడు. 8_29

## 22. ఊరడింపు లభించును

అతడే శ్రద్ధావంతుల హృదయములో సాంత్వనము ఉత్పన్నము చేసెను. దానివలన వారిలో గల శ్రద్ధ ఇంకను అధికమగును. 48_4

## 123. విముక్తి చేయుదును

1. మా దూతలకును శ్రద్ధాళువులకును మేము మోక్షము ఇచ్చెదము. ఇదే విధముగా శ్రద్ధావంతులకు మోక్షమునిచ్చు బాధ్యత మామీద గలదు. 10-108

## 124. త్వరపడకుము చిహ్నములను చూపెదను

1. మానవుడు తొందరపాటు గలవాడుగా సృజించపబడెను. సమీప భవిష్యత్తులో మీకు ప్రభువుయొక్క చిహ్నములను చూపించెదము, అందుచే మీరు నాతో త్వరపడుమని చెప్పకుడు. 21_37

## 125. ఓర్పువహించుడు

1. దేవదూతలును, జీవులును దాని వైపు ఒకదినములో ఎక్కుదురు. ఆ దిన ప్రమాణము ఏబది వేల సంవత్సరములు.

2. కాబట్టి ఓర్పు కలిగియుండుము. చాలా ఓపిక గల్గియుండుము. 70_4_5

## 126. క్రమ-క్రమ వికాసము

1. సంధ్యారాగముతో ప్రమాణము.

2. రాత్రితో అది ఆవరించిన దానితో శపథముచేసి చెప్పుచున్నాను.

3. పూర్ణుడైన చంద్రునితో

4. మీరు తప్పక క్రమక్రమముగా వికాసము పొందెదరు.

# 2. సత్సాంగత్యము

## 26. సత్సంగము

### 127. మహాపురుషుల సాంగత్యము

1. ఈశ్వరున్ని ఆతని దూత ఆజ్ఞలను మన్నించువారు, అనగా సందేష్టలు, సత్యభాషణులు, ఆత్మ సమర్పకులు, సాక్షాత్కార పరులు, సాధువులు సజ్జనులు వీరు ఈశ్వరుని కృపా పాత్రులగుదురు. నిశ్చయముగా వీరే ఉత్తమ సహచరులు.

2. ఇది ఈశ్వరునిచే లబ్ధమైన కృపావైభవము. మరియు అతడు పరిపూర్ణజ్ఞాని. 4-69-70

### 128. సత్సంగతి వెంటనంటియుండుడు

1. ఉదయ సాయములందు తమ ప్రభువును పిలుచుచూ, అతని ప్రసన్నతను పొందవలెనని కోరు వారి వెంట అంటియుండుము. ఐహిక జీవనపు మెరుపు తెరుపులు నీ నేత్రములను వారి నుండి మరలించకుండుగాక. 18-28

### 129. గురు ప్రబోధనా పద్ధతి

1. పిమ్మట మా దాసులలో ఒకరిని (మూసా) కనుగొనెను. మేము ఆ దాసుననుగ్రహించియుంటిమి మరియు (అతనికి) మా వద్ద నుంచి జ్ఞానమును ప్రసాదించితిమి.

2. అతనితో మూసా ఇట్లనెను. "నీకు చూపించిన సన్మార్గమును నాకు చూపుటకు ఏమీ ! నేను నీవెంట నుందునా ?"

3. నీవు ఎన్నటికి నా వెంట ఓర్పుతో నుండజాలవు అని అతను చెప్పెను.

4. "నీ బుద్ధి పరిధిలో లేని వస్తువు గురించి నీవు ఏల ఓర్పు వహించెదవని కూడా (అతడు) వినెను.

5. ఈశ్వరేచ్ఛ యున్నచో నన్ను తప్పక ఓర్పుగలవానిగా చూచెదవు. నేను నీ యే ఆజ్ఞను, ఉల్లంఘించనని, మూసా చెప్పెను.

6. అపుడు నీవు నన్ననుసరించదలచుచో, నేను నిర్దేశించువరకు నీవు ఏ మాట గురించి ఎట్టి ప్రశ్న వేయవలదని అతడు చెప్పెను. 18-65-70

## 130. స్వాధ్యాయమునకై కొందరు వెనుక నుండవలయును

1. శ్రద్ధావంతులందరు ఒకేసారి పయనించుట ఉచితముకాదు. వారి సముదాయము నుంచి ఒకభాగమే ప్రయాణము చేయవలయును. ఇందువల్ల మిగిలినవారు ధర్మసంబంధమగు జ్ఞానమును పొందగలరు. మరియు యుద్ధమునుంచి తిరిగివచ్చే వారిని, సావధానులను చేయగలుగుదురు. అందువల్ల ఆ సమాజము ధర్మము (మతము) గురించి జాగృతమై యుండగలదు. 9-122

## 131. సజ్జనుల సమాజము నిర్మింపుడు

1. ఓ, శ్రద్ధావంతులారా! ఈశ్వరుని గురించి మీ కర్తవ్యమును చక్కగ నిర్వహించుడు. సంపూర్ణమగు ఈశ్వర శరణ్యతాదశలో మరణించుడు.

2. మీరందరు కలసి ఈశ్వరుని త్రాటిని గట్టిగా పట్టుకొనుడు. చెదిరిపోకుడు. అతనికి మీపై గల దయను స్మరించుడు. మీరు

పరస్పరము శత్రువులుగా నున్నపుడు మీ హృదయములో స్నేహ భావమును ఉత్పన్నము చేయుటచే మీరు సోదరులైతిరి. మరియు మీరు అగ్నిగుండము గట్టున నిలిచి యున్నప్పుడు మిమ్ముల నతడు దాని నుండి కాపాడెను. ఈవిధముగా మీకు మార్గము లభించుటకు ఈశ్వరుడు తన చిహ్నముల వర్ణన చేయుచున్నాడు.

3. మీలో ఒక సముదాయము మంచి పనులకు ఆజ్ఞాపించునదిగాను, మరియు చెడును నిషేధించునదిగా నుండవలెను. ఇట్టివారే సఫలు లగుదురు. 3-102-104

## 131 పశు పక్షి సమాజము మనుష్యులవలె

1. ఈ భూమి మీద సంచరించు ప్రాణులు మరియు రెక్కలతో విహరించు పక్షులన్నియు, మీ వలెనే సమాజముగా నున్నవి.
6-33



# 3. అనాసక్తి

## 27. అనిత్యము

### 133. పాడుపడిన తోట

1. ఇహలోక జీవనపు స్థితిగతు లిట్లుండును.
(చూడుడు) ఉదాహరణకు ఆకసము నుంచి జలమును మేము వర్షింపజేసితిమి, దానివలన మనుష్యులు, పశువులు భుజించు వనస్పతి దట్టముగా పెరిగెను. భూమి రమ్యము, సస్యశ్యామల మయ్యెను. అపుడు భూకామందులు ఈ వైభవ సంపద మాకబ్బునని, అను కొను చుండిరి. అకస్మికముగా పగలో, లేక రాత్రియో మా ఆజ్ఞ అందెను అచట గల నిన్న లేదన్నట్లుగా పైకను కోసి, మేము ప్రోగుపెట్టితిమి. ఈ విధముగా వివేకముగల వారికొరకు మేము మా చిహ్నములను విస్తారముగా వర్ణించుచున్నాము.

### 134. పంటమీద మంచు

1. ప్రజలు ఇహలోక జీవనము కొరకు వ్యయము చేయుదురు. దాని దృష్టాంతము ఇటువంటిది. ఒక గాలి. ఆ గాలిలో మంచు. ఎవరు తమపై తాము అత్యాచారము చేసికొందురో వారి సేద్యమునకు ఆ గాలి తగిలినది. దానిచే అతని పంట నాశనమయ్యెను. కాని పరమాత్మ వారిమీద అత్యాచారము చేసినదేమియు లేదు. వారు తమపైతామే అత్యాచారము చేసుకొనుచున్నారు. 3-117

### 135. ఇహలోకము క్షణభంగురము

1. ఐహిక జీవన దృష్టాంతమును వారికిట్లు వర్ణించుము. "మేము ఆకసమునుండి జలమును వర్షింపజేసితిమి. ఆ నీటిచే భూమి మీద

పనస్పతులను, వాయువు ఎగురకొట్టిపోవునట్లు పొట్టుపొట్టయ్యెను. ఈశ్వరుడు సర్వకర్మ సమర్థుడు—

2. ఆస్తి, సంతానము ఐహికజీవనమునకు గీటురాళ్ళు. సత్కార్యములే మిగులునవి— అవియే మీ ప్రభువు సన్నిధిని, ఉత్తమోత్తమములైనవి. కాంక్షిత దృష్టితో కూడ ఇవే శ్రేష్ఠతరములు 18-45-46

## 136. సంసారముయొక్క శోభ పరీక్షకొరకే

1. నిస్సందేహముగా భూమిపైనిగల దంతయు దానికి శృంగారముగా నుండునట్లు మేము నిర్మించితిమి. ప్రజలలో సత్కార్యములు చేయువారెవరెవరో పరీక్షించుటకే అట్లు చేసితిమి. 18-7

## 137. శాశ్వతపట్టా యెవరికిని లేదు

1. మేము నీకన్నముందు ఏమానవునకు అమరత్వము ఒసంగలేదు. ఏమీ! నీవు చనిపోవుచో వీరు శాశ్వతముగా జీవించి యుందురా?
2. ప్రతి జీవియు మృత్యువును రుచి చూడవలసియున్నది. మిమ్ము మీ మంచి, చెడు పరిస్థితులద్వారా బాగా పరీక్షించుచున్నాము. నా వద్దకే మీరు తిరిగి రాగలరు— 21-34-35

## 138. నీవు సురక్షితుడవా?

1. ఏమీ! నిన్ను ఇచటగల వస్తు సముదాయములో నిర్భయునిగా వదలెదరా?

2. ఉద్యానవనములలోను, సెలయేరులలోను

3. పంట పొలాలలోను, గుచ్ఛములు రాలు ఖర్జూరములలోను

4. అయినపుడు, నీవు ఉలుకుతూ పర్వతములలో గుహలు నిర్మించి ఉండగలవా? 23-146-149

## 139. సంసారము ఒక లీల

1. ఐహిక జీవనము మనోరంజితము మరియు క్రీడవంటిది తప్ప మరేమియు కాదు. పరలోకమే గృహమే వాస్తవ జీవనము. అరే అరే వీరు తెలుసుకుంటే గదా! 29-64

## 140. వాసనా విషయములు

1. వాసనలను ఆకర్షించు విషయములమీద ప్రేమ ప్రజలను ఆసక్తుల చేయుచున్నది. ఉదాహరణకు స్త్రీలు, పుత్రులు, వెండి, బంగారము. ఉత్తమాశ్వములు, పశువులు మరియు సేద్యము. ఇవి ఐహిక జీవనమునకు మూలధనములు. కాని ఈశ్వరుని సన్నిధియే, ఉత్తమ ఆశ్రయము. 3-14

# 28. వైరాగ్యము

## 141. భోగ విలాసములపై కోరిక ఉంచకుడు

1. ఇహలోక జీవనమునకు శోభ నిచ్చి, లాభము పొందుటకు నాచే పరీక్షార్థము కల్పించబడి, జంటలుగానున్న రమ్యమగు వస్తువుల వైపు కన్నెత్తి చూడకుము. నీప్రభువుచే ప్రాప్తమగు వరప్రసాదమే అధికహితకరము. స్థిరమైనది. 20-134

## 142. స్త్రీ పుత్రులు శత్రువులగుట సంభవము

1. ఈశ్వరుడు తప్ప వేరొకడు భజనీయుడు లేడు. శ్రద్ధావంతులు ఈశ్వరుని మీదనే సంపూర్ణ విశ్వాసముంచవలెను.

2. ఓ, శ్రద్ధావంతులారా! మీ ఆలుబిడ్డలు మీ శత్రువులగుట సంభవము. కావున మీరు వారినుండి కాపాడుకొనుడు. మీరు వారి దోషములను మరచుడు. వారి లోపములను చూడకుడు. వారిని క్షమించుడు. నిస్సందేహముగా ఈశ్వరుడు క్షమాశీలుడు. కరుణా మూర్తి. 64_13_14

## 141. స్వార్థరహితుడవగుము

1. మీ ఆస్తి, మీ సంతానము, మీకు పరీక్షార్థము ఇవ్వబడినవి. ఈశ్వరుని చెంతనే గొప్ప కానుకలు గలవు.

2. అందుచేత శక్తికొలది ఈశ్వరుని పట్లగల మీ కర్తవ్యమును పూర్తి చేయుడు. వినుడు, అంగీకరించుడు. అతని మార్గములో ధనము వ్యాయపరచుడు. ఇందులోనే మీ మేలు యున్నది. ఎవరు లోభము నుండి తమ్ము కాపాడుకొందురో వారే సఫలురు కాగలరు. 64-15-16

## 141. సైతాన్ నుండి జాగ్రత్త!

1. నిస్సందేహంగా, ఈశ్వరుని వాగ్దానములు సత్యమైనవి. కాన ఇహలోక జీవనము మిమ్ము మోసగించకుండు గాక! కపటియగు సైతాను ఈశ్వరునివిషయమున మిమ్ము ఎన్నటికి మోసము చేయుకుండుగాక!

2. నిస్సందేహముగా సైతాను మీరు శత్రువు. అతనిని శత్రువుగా తలచుడు. అతడు తన బృందమును(పరివారమును) మీరునరకమును పొలగుటకు పిలుచుచున్నాడు. 35_5_6

## 145. ఉభయలోకముల పంట

1, పరలోకపు పంట కోరువారికి, వారి కృషికి మించిన పంట నేను ఇచ్చుచున్నాను. ఇహలోకపు పంట కోరు వారికి నేను ఇచట కొలది మాత్రము ఇచ్చెదను ఇట్టి వారికి పరలోకములో భాగము దొరకదు. 42-20



# చతుర్థ ఖండము

## భక్తులు - భక్తిహీనులు

# 4. భక్త లక్షణములు

## 29. దశ లక్షణములు

**146.** దశ లక్షణములు

| | |
|---|---|
| 1. శరణాగతులు | శరణాగతురాండ్రు |
| 2. శ్రద్ధావంతులు | శ్రద్ధావతులు |
| 3. ఆజ్ఞాపాలకులు | ఆజ్ఞాపాలికలు |
| 4. సత్య భాషులు | సత్యషిణులు |
| 5. ధీరులు | ధీరురాండ్రు |
| 6. వినయశీలురు | వినయశీలలు |
| 7. దానశీలురు | దానశీలలు |
| 8. ఉపవాసులు | ఉపవాసినులు |
| 9. శీలరక్షకులు | శీలరక్షకురాండ్రు |
| 10. ఈశ్వర స్మరణశీలురు | ఈశ్వర స్మరణశీలలు |

వీరి కొరకు ఈశ్వరుడు క్షమ, మరియు గొప్ప పుణ్యఫలమును స్థిరపరచి యుంచినాడు— 33-35

# 30. ప్రార్థనాపరులు

## 147. రాత్రులందు మేల్కొను యోగులు

1. నిస్సందేహముగా ఈశ్వరపరాయణులు స్వర్గోద్యానములలోను, స్వర్గమందలి సెలయేరులలోను నివసించెదరు.
2. వారు ప్రభువు ప్రసాదించిన దానిని గైకొందురు. ఇంతకు పూర్వము వారు సదాచారులై యుండిరి.
3. వారు రాత్రులందు స్వల్పముగా నిద్రించుచుండిరి.
4. వారు గతించిన రాత్రియందు (తమ) పాపములను క్షమించమని ఈశ్వరుని వేడుకొనుచుండిరి—
5. వారి సంపత్తిలో భిక్షుకులకును, సాధువులకును, అధికారము కలదు. 51-15-19

## 148. వారి ప్రక్కలు పడక నంటవు

1. మా వచనములను ప్రబోధించునపుడు ఎవరు ప్రణతులర్పించుటలో తన్మయులగుదురో, మరియు తమ ప్రభువును స్తుతితో పాటు స్మరించుచుందురో, గర్వపడరో, వారే నావచనములను మన్నించువారు.
2. వారి ప్రక్కలు శయ్యనంట కుండును మరియు తమ ప్రభువును భయముతోను, నమ్మికతోను, పిలచుచుందురు. ఇంతను మేము ఇచ్చిన దానిని మా మార్గమునందే వ్యయపరతురు.
3. ఇట్టివారికొరకు, వారికి ప్రసన్నత గలిగించు వస్తువులు ఏవేవి దాచి యుంచబడినవో, ఎవరికి తెలియదు. వారు చేసిన కార్య కలాపములకు అవి ప్రతిఫలములు. 32-15-17

## 149. నొసటి గుర్తులు — ఘటికలు

1. నీవు వారిని ప్రణామములు, ప్రణతులు అర్పించుచుండగాను, ఈశ్వరుని కృపావైభవమును, ప్రసన్నతను అన్వేషించుచుండగాను చూచెదవు. ప్రణతులవల్ల నొసటిపై పడిన ఘటికలు, అట్టివారిని కనుగొను గుర్తులు-తౌరాతుతోను, బైబిలుతోను వారిని సరిగా పోల్చుకొను ఉపమానములు కలవు. "సేద్యముపలన మొలకలు ఎత్తెను. ఆ మొలక గట్టిపడి లావై తన బలముచే నిలిచి "సేద్యగాండ్రను సంతోషపెట్టుట మొదలిడెను" 48-29

## 150. కంపిత హృదయులు

1. ఈశ్వరుని వర్ణించునపుడు ఎవరి హృదయములు కంపించునో, అతని (ఈశ్వరుని) వచనములు పఠించినచో ఎవరి శ్రద్ధ, అధిక మగునో, మరియు తన ప్రభువుపై విశ్వాసముంచెదరో వారే శ్రద్ధావంతులు. 8-2

## 151, వినమ్రులు

1. ...వినమ్రులకు శుభసందేశమిమ్ము.
2. ఈశ్వరుని వర్ణించునపుడు వారి హృదయములు కంపించునో. వారు ఆపదలు పైబడినపుడు సహనముతో నుందురు. మరియు నిత్యనియమిత ప్రార్థన చేయుదురు. నేనిచ్చిన దానిని నా మార్గములో వ్యయపరచుచుందురు. 22-34-35

## 152. కృపాళుని దాసులు

1. ఆకాశమున రాశీచక్రమును నిర్మించి దానిలో ఒక ప్రచండమైన జ్యోతిని (సూర్యుని) మరియు కాంతిమంతుడగు చంద్రుని నిర్మాణము చేసిన వాడు మంగళ ప్రదుడు.

2. అతడే మారుచుండు మరియు ముందు వెనుకల వచ్చు రాత్రిం బవళ్ళను, సృష్టించెను. ఆలోచించువారికిని, కృతజ్ఞత చూపే వారికిని, ఇవన్నియు అతనికి సంబంధించిన చిహ్నములు

3. పృథివిపై వినమ్రులై సంచరించు వారిని, అవివేకులు సంబోధించు నపుడు "సోదరా—నమస్కారము" అని అనుచుందురు. అట్టి వారు కృపాళుని దాసులు.

4. వారు తమ ప్రభువు సమక్షమున నిలుచుండి ప్రణతులర్పించుచూ, రాత్రులు గడుపుదురు. 25-61-64

## 31. నిష్ఠాపరులు

### 153. నామీదే చిత్తము - నామీదే ప్రాణము

1. ఈశ్వరుని ప్రసన్నత కొరకు తమ ప్రాణములను అర్పించువారు, ప్రజలలో గలరు. ఈశ్వరుడు తన దాసులమీద ఎక్కువ స్నేహము చూపును. 2-207

### 154. అన్యోన్యమిత్రులు

1. నిస్సందేహంగా, శ్రద్ధావంతులై జన్మభూమిని వదలి ధన, మనః ప్రాణములతో భగవన్మార్గమున పోరాడువారును, వారికి స్థాన మిచ్చువారును, సహాయపడువారును, వీరందరు ఒకరికొకరు మిత్రులు. 8-72

### 155. ఈశ్వరుని మిత్రులు

1. జ్ఞప్తియందుంచుకొనుడు ఈశ్వరునికి సన్నిహితులెవరో వారికి భయమును లేదు, దుఃఖమునులేదు.

2. వారు శ్రద్ధావంతులుగాను, సంయమముగలవారుగా నుందురు.

3. ఐహిక జీవనము నందును పరలోకమందును వారికి శుభసందేశము గలదు. పరమాత్ముని మాటలు మారునవి కావు. 10-62-64

## 156. ఈశ్వరుని భక్తమండలి

1. ఈశ్వరుని యందును, అంతిమ దినమందును, విశ్వాసము గల వారు, ఈశ్వరునికిని, అతని దూతకును, విరోధులగు వారితో, వారు వారి పితాపుత్రులు, సోదరులు, ఇంటివారలైనను, మిత్రుత్వమును కలిగియుందుటను మీరు చూడకుందురు. ఇటువంటివారి హృదయములలో ఈశ్వరుడు శ్రద్ధాభక్తులను చిత్రించి ఉంచినాడు. మరియు తన ఔదార్యముచే సహాయపడినాడు. నదులు ప్రవహించు ఉద్యానములలో ఈశ్వరుడు వారిని ప్రవేశపెట్టును. అచట వారు సదానివసించెదరు. ఈశ్వరుడు వారికి ప్రసన్నుడు మరియు వారు ఈశ్వరునికిష్టులై యుందురు, వీరలదే ఈశ్వరుని భక్త మండలి. శ్రద్ధతో వినుడు. ఈ భక్తమండలియే కళ్యాణము నొందగలదు. 58-22

# 32. ధైర్యవంతులు

## 157. సహనశీలురు

1. ఓ శ్రద్ధావంతులారా ! కష్టకాలములో ఓర్పువహించి, ప్రార్థనచే సహాయ మర్థించుడు. నిస్సందేహముగా ఓర్పుగలవారి వెంట ఈశ్వరుడున్నాడు.

2. భగవన్మార్గమున మరణించువారిని చనిపోయిరని అనకుడు. వారు బ్రతికి యున్నవారే ; కాని మీకు తెలియుటలేదు.

3. మేము మిమ్ములను కొంత భయము కల్పించియు, ఆకలిచేతను, ధనమునకు, ప్రాణమునకు, పంటలకు హాని కలిగించుటద్వారా మిమ్ముల తప్పక పరీక్షించెదము. ఓర్పుగలవారికి ఈ సందేశము వినిపించుము.

4. ఆపద గల్గినప్పుడు "మేము ఈశ్వరుని వారమే. అతని కభిముఖులమై పోవువారమని చెప్పుదురు.

5. ఇట్టి వారిపై వారి ప్రభువు దయ, కృపగలదు. వారే సరియగు మార్గములో నున్నవారు. 2-253-257

## 33. అహింసకులు

### 158. క్షమాశీలము

1. మన ప్రభువుయొక్క క్షమాశీలత వైపును, స్వర్గము వైపును, పరుగిడుదురు, దానివ్యాపకతలో, భూమ్యాకాశములు సమావిష్టమై యున్నవి. పాపము నుంచి రక్షించబడు వారికొరకు, అది సిద్ధము చేయబడియున్నది.

2. వారు సంపదలోను. ఆపదలోను మా మార్గము నందే వ్యయపరచెదరు. కోపమును దిగమ్రింగెదరు. జనుల దోషముల వైపు దృష్టి ఉంచరు. ఈశ్వరుడు సత్కార్యములు చేయువారిని ప్రేమించును.

3. లజ్జాస్పదమగు పనులు చేసినప్పుడు లేక తమపై తాము అత్యాచారములు చేసుకొన్నపుడు వారికి ఈశ్వరుడు జ్ఞప్తికి వచ్చును. (వారు) తమ పాపములకు క్షమను వేడెదరు.

ఈశ్వరుడుగాక మరెవరు, పాపములను క్షమించెదరు ? వారు తాము చేసిన దానిగురించి పట్టుదల వహించరు.

4. వారికి ఈశ్వరునిచే లభించు ప్రతిఫలము క్షమ. మరి క్రింద ప్రవహించు నదులుకల ఉద్యానములలో వారు సతతము నివసించెదరు. కర్మనిష్ఠులకు ఇది ఎంత ఉత్తమ బహుమానము 3-133-136

## 159. మహోదారుడు

1. వారు ఈశ్వరుని ప్రేమకొరకు వంచితులకు, అనాథలకు మరియు బంధితులకు (ఖైదీలకు) అన్నము పెట్టుచున్నారు.

2. కేవలము ఈశ్వరుని ప్రసన్నత కొరకే వారు తిండి పెట్టెదరు. వారు మీనుండి ఎట్టి కృతజ్ఞతను, ప్రతిఫలమును వాంఛించమని చెప్పుదురు.

3. మాకు మా ప్రభువు యొక్క భయముగలదు. కనుబొమలు చిట్లీ, పెదముఖమును కలుగజేయు ఆదినము గురించి భయపడెదము.

4. అందువలన ఈశ్వరుడు వారిని ఆ దినముయొక్క సంకటము నుండి కాపాడి, వారికి ఆనందమును, స్ఫూర్తిని కలిగించి సహాయపడెను. 76-8-11

## 160. పరస్పర విమర్శకులు

1. ఎవరు పాపములు మరియు లజ్జాస్పదమగు కార్యములకు దూరముగా నుందురో, వారు తమకు క్రోధము వచ్చినపుడు క్షమించుచున్నారు.

2. మరియు ఎవరు ఈశ్వరుని ఆజ్ఞను మన్నిస్తూ. నిత్యనియమిత ప్రార్థన చేయుదురో, వారి పని పరస్పర విమర్శతో జరుగును. మేము ఇచ్చినది మా మార్గములో వ్యయపరతురు. 47-37-38

## 161. సంధాన కర్తలు

1. ఈశ్వరుడు దేనిని జోడించుటకు ఆజ్ఞఇచ్చెనో, ఎవరు దానిని జోడించెదరో: మరి ప్రభువుకుభయపడుదురో, ఇంకనూ హానిప్రద మగు లెక్కవచ్చునను చింత చేయుదురో.

2. తమ ప్రభువుయొక్క ప్రసన్నతను కోరుటలో ఓర్పు చూపెదరో, నిత్య నియమిత ప్రార్థన చేయుదురో, మేము ఒసగిన దానిని మా మార్గములో వ్యక్తంగాను, గుప్తంగాను వ్యయపరచెదరో, దురిత మును మంచితనముచే దూరము చేసికొందురో వారలకు సద్గతి కలుగును. 13-21-22

# 34. భక్తులకు ఆశీర్వాదము

## 162. భక్తులపై సైతాన్ ప్రభావము పడదు

1. ఓ సైతానా! నీ మార్గములో నడచు భ్రమితులపై తప్ప నా భక్తులపై నిస్సందేహముగా నీ శక్తి, ప్రభావములు ఎంతమాత్రము పనిచేయవు.

## 163. భక్తులకై దేవదూతల ప్రార్థన

1. ఈశ్వర సింహాసనాధారము వహించుచూ, దానిని చుట్టికొనియుండు దేవదూతలు తమ ప్రభువును జపించుచూ స్తోత్రము చేయు

చుందురు. మరియు అతనిపై శ్రద్ధగలిగి యుండి, శ్రద్ధావంతుల క్షమకొరకు ఇట్లు అర్థించుచున్నారు.

"ఓ ప్రభూ ! నీ కరుణ, నీ జ్ఞానము, ప్రతి వస్తువునందు వ్యాపించియున్నది. కాన పశ్చాత్తాప పడి నీ మార్గమున నడచు వారిని క్షమించుము - మరియు వారిని నరకయాతనము నుండి రక్షించుము."

2. ఓ ప్రభూ ? నీవు మాట ఇచ్చినట్టియు, నిత్యనివాసయోగ్యమైనట్టియు, స్వర్గములో వారిని, వారి తాత తండ్రులను మరియును వారి భార్యాపుత్రులలో సత్కార్యములు చేయువారిని ప్రవేశపెట్టుము. నిశ్చయముగా నీవు సర్వశక్తిశాలివి. మరియు సర్వవిధుడవు.

3 వారలను దుష్కృత్యముల నుండి కాపాడుము. ఆ దినమున నీవు ఎవరిని దురితము నుండి రక్షించెదవో వారిపై, నీవు పరిపూర్ణ దయ చూపితివి. ఇదే మహావిజయము.



# 15. భక్తిహీనులు

## 35. నాస్తికులు

### 164. రాతి కంటె కఠోరములు

1. ఈశ్వరీయ సంకేతములు, చూచిన మీదటను, వారి మానసములు రాళ్ళవలెను, అంతకంటెను, కఠినములు. వాస్తవమునకు కొన్ని శిలల నుండి నీటి జాళ్ళు వెడలుచున్నవి. మరికొన్ని రాళ్లు పగులుటచే వాటినుండి నీరు చిమ్ముచున్నది. మరికొన్ని రాళ్లు ఈశ్వరుని భయముచే క్రిందపడుచున్నవి.

### 165. అవిశ్వాసము యొక్క హద్దు

1. మేము వారి యెదుట ఆకాశము యొక్క ద్వారమును తెరిచిననూ, కొందరు పట్టపగలే దానిని ఎక్కుచున్ననూ,

2. మాదృష్టి అరికట్టబడినదని, మాపై మచ్చు చల్లబడినదని భక్తిహీనులు అందురు. 15-14-15

### 166. అస్థిర చిత్తులు

1. అతడు ఆలోచించెను మరియు ఎత్తుగడవేసెను.

2. ఏమి ఎత్తుగడ వేసెను ? అతనిని ఈశ్వరుడు నాశనము చేయుగాక !

3. అతడు నాశనమే అగుగాక ! ఎట్టి ఎత్తుగడ వేసెను ?

4. పిమ్మట అతడు ఆలోచించెను.

5. కను బొమ్మలు ముడిచి పెదముఖము పెట్టెను.

6 వీపును మళ్ళించి అహంకృతుడై నడిచెను.

7. మరియు నుడవ సాగెను–

"ఇది కేవలము ఇంద్రజాలము–

మొదటి నుంచి సాగుచున్నదే ! 14-18-24

## 167. చమత్కారములు చూపించుము.

1. వారు నుడివిరి——

"నీవు మాకై భూమినుండి ఒక ప్రవాహమును ప్రవహింపచేయు నంతవరకు మీ మాటను ఎన్నిటికిని నమ్మువారము కాము.

2. లేక, నీకు ఒక ఖర్జూర, ద్రాక్షతోట ఉండవలె. దాని మధ్య నీవు నదులను ప్రవహింపచేయ వలె.

3. లేదా, నీవు చెప్పినట్లు ఆకాశము ముక్కలు ముక్కలై మీద పడ వలె. ఈశ్వరున్ని, లేక దేవ దూతలను మా సమక్షమునకు తేవలె.

4. లేకున్న, నీకు ఒక సువర్ణమయ భవనము ఉండవలె, మరి నీవు ఆకాశము నధిరోహించవలె, మేము పఠించిదగిన ఒక గ్రంథమును తీసుకొని రావలె. అంతవరకూ నీవు ఆకాశము నారోహించినను మేము నిన్ను నమ్మజాలము."

నీవు చెప్పు :— "నా ప్రభువు పవిత్రుడు. నేను మానవుడను. సందేశవాహకుడను మాత్రమే" 17-90-93

## 168. వితండ వాదులగు నాస్తికులు

(నామ మాత్రులగు ఆస్తికులు)

1. కొందరు పరమాత్మను గురించి పోట్లాడు చుందురు. వారికి జ్ఞానమూలేదు. మార్గదర్శకులు లేరు. ప్రకాశమిచ్చు గ్రంధమూ లేదు.

2. ఈశ్వరుని మార్గము నుంచి పెడమార్గము పట్టించుటకు వారు గర్వితులై వాదులాడు చుందురు. ఇట్టివారికి ప్రపంచములో అపకీర్తియే మిగులును. మేము వారికి పునరుద్దాన దినమందు ప్రజ్వలించు అగ్ని శిక్షను అనుభవింపచేసేదము.

3. .........కొందరు సీమారేఖపై నిలచి, పరమాత్మను భజించెదరు. లాభము గల్గుచో భజించుటకు నిలచి యుందురు. పరీక్షకు గురియగుచో విముఖులగుదురు. అట్టివారు ఇహ, పరలోకములు, రెంటిని పోగొట్టు కొనువారగుదురు. ఇది తీర్చరాని హాని–

22-59-11

## 169. అవిశ్వాసుల ఉపమానము

1. అవిశ్వాసుల దృష్టాంతము ఇటు వంటిది– "ఒక వ్యక్తి అగ్నిని రగిల్చెను. ఆ అగ్ని పరిసరములను వెలిగించెను. అయినప్పటికి ఈశ్వరుడు వారి ప్రకాశమును హరించెను మరియు వారిని చీకటిలో వదలెను. అందువలన వారేమియూ కనుగొన లేకపోయిరి."

2. వారు చెవిటివారు. గ్రుడ్డివారు, మూగవారు కాన వారిలో మార్పు రాదు.

3. లేక వారి దృష్టాంతము ఇలా గలదు. "ఆకాశము నుండి కుంభ వర్షము కురియుచున్నది. దానిలో అంధకారము. మేఘగర్జన మరియు తళ-తళమను మెఱుపు, ఆ ఫెళ ఫెళ ధ్వనులకు చచ్చెద మన్న భయముతో తమ చెవులలో వ్రేళ్ళు పెట్టుకొనుచున్నారు. ఈశ్వరుడు విశ్వాస హీనులను నలువైపులా ముట్టడించి యున్నాడు.

4. విద్యుత్తు వారి దృష్టిని హరించి వేయునట్లు అనిపించును. మెరిసి నపుడు దాని కాంతిలో వారు నడువసాగుదురు. చీకటి గ్రమ్మి నపుడు నిలచిపోవుదురు. ఈశ్వరుడు తలచుకొన్నచో వారి దర్శన, శ్రవణ శక్తిని హరించివేయగలడు. నిస్సందేహముగా ఈశ్వరుడు సర్వకర్మ సమర్థుడు, 2-17-20

## 36. భ్రాంతచిత్తులు

### 170. శ్రీమంతులు అంగీకరించరు

1. మేము ఒక పట్టణమునకు హెచ్చరిక చేయు వారిని పంపగా అచటి ధనికులు "నీవు ఏ వస్తువువెంట పంపబడితివో దానిని మేము అంగీకరించమనిరి."

2. మరియు మాకు సంతానము, ఆస్తి అధికముగా నున్నది. ఇంక మాకు ఎట్టి శిక్ష పడదని వారు నుడివిరి. 34-34-35

### 171. అంధవిశ్వాసము, మూర్ఖులవని

1. ఇతరులు శ్రద్ధగలిగి యున్నట్లు మీరును శ్రద్ధగలిగి యుండుడని వారికి చెప్పినపుడు ఏమి! మూర్ఖుల అంధవిశ్వాసమువలె మేము

శ్రద్ధగలిగి యుందుమా ? అని వారు అనుచుందురు. గుర్తించుడు, వాస్తవముగా అట్లనువారే మూర్ఖులు. కాని, వారు తెలుసుకొనుట లేదు. 2_13

## 172. కామవాదులు - కాలవాదులు

1. దేహవాసనలను తమ దేవతగా రూపొందించుకొన్న వ్యక్తులను నీవు చూచితివా ? వారు వివేకము గలవారైనను ఈశ్వరుడు వారిని మార్గభ్రష్టులుగా చేసి వారి చెవులపైని, మానసములపైని ముద్రయు, వారి నేత్రములపై తెరయు పడవేసి ఉంచినాడు. అయినపుడు పరమాత్ముడు తప్ప మరెవరు వారిని దారికి తీసుకొని రాగలరు ? అయితే మీరు ఆలోచించరా !

2. ఇంకను ఐహిక జీవనము తప్ప మరొకటి మాకేమీ లేదని, మేము చచ్చెదము, బ్రతికెదము, కాలముతప్ప మమ్ములను చంపేవారు ఎవరూ లేరని, వారు చెప్పెదరు. 45_28_24

## 173. ఈశ్వరుడే ఇవ్వనపుడు మేమెందు కివ్వవలె ?

1. పరమాత్మ మీకు ప్రసాదించిన దానిని అతని మార్గములో వ్యయ పరచుడని వారితో చెప్పినపుడు, ఈశ్వరుడు తలచినచో పెట్ట గలవారికి మే మెందుకు తినపెట్టవలెనని, మీరే స్పష్టముగా భ్రాంతావస్థలో నున్నారని, శ్రద్ధాహీనులు శ్రద్ధావంతులతో అనుచుందురు. 36_47

## 174. భక్తులను బాధపెట్టువారు

నిస్సందేహంగా శ్రద్ధావంతులగు స్త్రీ, పురుషులను బాధించి, పశ్చాత్తాపము నొందని వారికి, నరక దండన, అగ్నిశిక్ష గలదు. 85_10

### 175. అజ్ఞానులతో చెడుగా వ్యవహరించుట మంచిదనువారు

1. గ్రంథవంతులలో కొందరు, వారి చెంత నీవు ధనరాశిని ఉంచినను, ఉన్నదున్నట్లు తిరిగి నీకు ఇచ్చివేయుదురు. మరికొందరు నీవు ఒక పైస నిల్వవుంచినను, నెత్తిమీదపడి ఒత్తిడిచేయుపరకు ఇవ్వనివారు గలరు. చదువురాని అజ్ఞుల విషయమున ఇట్లు వ్యవహరించుట పాపము కాదని వాదించుదురు. వారు తెలిసియే ఇట్లు చేయుదురు. 3-75

## 37. వ్యర్థమగు పనులు చేయువారు

### 176. అంతయు బూడిదలో హోమము చేయబడినది

1. తమ ప్రభువుపట్ల అశ్రద్ధగలవారి క్రియాకలాపములు తుఫాను గాలిచే ఎగురగొట్టబడిన బూడిద వంటిది. వారు సంపాదించిన దానిలో, వారికి ఏమియూ దక్కదు. ఇదే తీరని భ్రాంతి. 14-18

### 177. త్రవ్విన గుహలు నిరుపయోగము లయ్యెను

1. హిజ్రీనివాసులు ఈశ్వరుని దూతలను తిరస్కరించిరి

2. మేము వారికి మా సంకేతములు కనబరచితిమి. కాని వారు విముఖులైరి.

3. మరియు వారు నిశ్చయులై గుట్టలలో ఇండ్లు తొలచుకొన సాగిరి.

4. కాని ఉదయ మయ్యే పరకు పెద్ద ప్రేలుడుకు వారు గురియైరి.

5. అందుచే వారి కృషి, వారి కౌశలము ప్రయోజనకారి కాదయ్యెను. 15-80-84

## 178. ఎవరి పనులు వ్యర్థమగును

1. చెప్పు : ఏమి ? మేము మీరు చేయు పనులనుబట్టి, పెద్దగా నష్ట పడు వారు ఎవరో వారి గురించి చెప్పమా ?

2. ఎవరు తమశక్తి నంతయు ఇహలోక జీవనముకొరకే దారపోసి, ఘనకార్యములు చేసితిమని తలచుచుందురో వారే వీరు......

3. వీరలే మన ప్రభువు సంకేతములను, వారి సన్నివేశములను తిరస్కరించెదరు. వారు చేసినదంతయు నాశనమైనట్టే. ఇందువల్ల వారికి అంతిమ దినమందు మేము ఎట్టి ఘనతను లేకుండ చేయుదుము. 18-103-105

## 179. గాడిదతో ఆచరణహీనుని పోలిక

(మంచిగంధమును మోయు గాడిదె వలె)

1. ఎవరిపై ధర్మగ్రంథము 'తౌరాతు' యొక్క భారము వేయబడెనో వారు, దానిని నిర్వహించలేదు. అట్టివారి దృష్టాంతము వీపుమీద పుస్తకములు మోయు గాడిదవంటిది. 62-5

# 38. "నరకము పొందు వారు"

## 180. పైనుంచి క్రింద బడుట

1. ......ఈశ్వరునికి భాగస్వాములను సృష్టించువారు ఆకాశము నుండి క్రింద పడిన వారే యగుదురు. వారిని పక్షులు లేవనెత్తు కొని పోవుదమో, లేక గాలి దూరస్థలమున విసరివేయుదమో జరుగ గలదు. 22-31

## 181. సైతాన్ ఎట్టి దుష్టసహచరుడు

1. ఈశ్వర స్మరణకు విముఖుడగువాని కొరకు మేము ఒక సైతానును ఏర్పాటు చేసితిమి. అతడు వానికి సహచరుడై యుండును.

2 వాడు వానిని మార్గమునుండి తప్పించుచుండును. అయినను అతడు నేను సరియగు మార్గములో నున్నానను కల్పనలో నుండును

3. అయితే అతడు నా సన్నిధికి వచ్చినపుడు సైతాన్‌తో అయ్యో, అయ్యో నీకు - నాకు పూర్వపశ్చిమముల కున్నంత ఎడము ఉన్నదే! ఎంత దుష్ట సహచరుడవు అని అనగలడు. 43-36-38

## 182. సైతాన్ ఎవరిపై సవారీచేయును

1. సైతాన్ ఎవరిని ఆవేశించునో నేను మీకు తెలియచేయనా?

2. అబద్ధమాడు ప్రతి పాపాత్ముని,

3. మరియు అటు, ఇటు చెవి యొగ్గువారిని. అబద్ధమాడువారే వారిలో అధికులుగా నుందురు.

4. ఇంకను కవులను - మార్గము తప్పినవారే వారిని అనుసరింతురు.

5. ఏమీ? నీవు చూడలేదా! వారు ప్రతి క్షేత్రమునందు తల మోదు కుంటూ తిరుగుచుందురు.

6. మరియు చెప్పునది వారు చేయుట లేదు. 26-221-226

## 183. మన చేష్టలు

1. ఏ వస్తువు మిమ్ములను నరకములో చేర్చినదని స్వర్గవాసులు నరక వాసుల నడిగిరి.

2. మేము ప్రార్థన చేయకుంటిమి.
3. బీదలకు అన్నం పెట్టలేదు.
4. పొగరుబోతులతో గూడి వదరుచుంటిమి.
5. అంతిమన్యాయదినమును అంగీకరించమంటిమి.
6. ఇంతలో మాకు మృత్యువు వచ్చెను అని వారు చెప్పెదరు.

## 184. నాస్తికులను తిరస్కరించుట

1. ఆ దినమున ఈశ్వరుని విశ్వసించని వారికి ధిక్కారము.
2. ఏమీ ! మేము ఇంతకు పూర్వముగల ఇట్టి వారిని నష్టపరచలేదా ?
3. వచ్చే వారిని కూడ. వారితో చేర్చెదము.
4. మేము పాపాత్ములతో ఇటులనే వ్యవహరించెదము.
5. ఆ దినమున ఈశ్వరున్ని తిరస్కరించిన వారికి ధిక్కారమే. (నాశనమే) 77-17-19

## 185. అయ్యో నేను ధూళినౌతే ?

1. నిస్సందేహముగా సమీపించనున్న ఆపదచే మేము మిమ్ములను సావధానులచేసితిమి. ఆ దినమున ప్రతి మనుష్యుడు తాను చేసిన పన్నులను చూడగలడు మరియు వానిని చూచి శ్రద్ధాహీనుడు అయ్యో ! అయ్యో ! నేను ధూళిని కాకపోతినే, అని అనగలడు. 78-40



# పంచమ ఖండము

# 16. ధర్మచింతన

## 39. ధర్మనిష్ఠ

### 186. ధర్మసారము

1. తూర్పువైపు ముఖము పెట్టవలెనా? లేక పడమరా? అనునది. ధర్మచింతన కాదు. ఈశ్వరునిపైన శ్రద్ధయు, అంతిము దినము పైన, దేవదూతలుపైన శ్రద్ధ, ఈశ్వరప్రీతికై బంధువులకు, అనాధలకు, వంచితులకూ, యాత్రికులకు, యాచకులకు, ధనమిచ్చుటయు మరియు బందితుల విడిపించుటకొరకు ధనమిచ్చుటయు, నిత్య నియమిత ప్రార్థన చేయుటయు నియమిత దానము, చేసిన ప్రతిజ్ఞను పూర్తి చేయుటయు, సంకటములోను, ఆపదలోను ఓర్పుగలిగి యుండుటయు, ఇవన్నియు ధార్మికత యనబడును. వీరే సత్య ప్రియులు మరియు ఈశ్వర పరాయణులు. 2—177

### 187. ధర్మము యొక్క మర్యాద

1. కాబట్టి నీకిచ్చిన ఆదేశముల ప్రకారము దృఢముగా నుండుము. మరియు నీతోపాటు పశ్చాత్తాప పడి నావైపు మరలిన వారు కూడ దృఢముగా నుందురుగాక. హద్దును మీరకుము. నిస్సందేహముగా నీవు చేయునదంతయు ఈశ్వరుడు చూచును.

2. అత్యాచారముల వైపు మ్రొగ్గకుము. అట్లు మ్రొగ్గితివా అగ్నిముఖమున పడిపోగలవు. ఈశ్వరుడు తప్ప వేరొక సంరక్షక మిత్రుడు నీకు లేడు. మరియు నీకు (ఎవరు) సహాయము చేయరు.

3. ఉభయ సంధ్యల యందు, కొంత రాత్రి గడచినమీదట నియమిత ప్రార్థన చేయుము. నిస్సందేహముగా సత్కార్యములు దుష్కార్యములను దూరము చేయును. జ్ఞప్తియందుంచుకోగల వారికి, ఇది ఒక స్మరణదాయకమగు వస్తువు.

4. ఓర్పుగలిగి యుండుము. నిస్సందేహముగా (చేసిన) శ్రమ నష్టము కాదు. 11-112-115

## 188. మానవ స్వభావమును అనుసరించడమే ధర్మము

1. ధర్మము (మతము) కొరకు మరియు ఏకాగ్రచిత్తము కొరకు మీ దృష్టిని స్థిరపరచుకొనుడు. ఈశ్వరుడు సృష్టించిన మానవ స్వభావమునే అనుసరింపుడు. ఈశ్వరుని సృష్టి నియమములలో మార్పు ఏమియూ నుండదు. ఇదే సరళమగు ధర్మము. కాని పెక్కురు ఈ విషయమును తెలుసుకొనుట లేదు. 30-30

## 189. ఇస్లాము నిష్ఠ

1. ఆకాశములోను భూమిలోను గల దంతయు పరమాత్మునిది. మీరు మీ మనోభావములను దాచినను, ప్రకటించినను ఈశ్వరుడు మీతో లెక్క గైకొనగలడు తదనంతరము అతడు ఇష్టమున్న వారిని క్షమించును. లేక దండించును. ఈశ్వరుడు సర్వకర్మ సమర్థుడు.

2. దూత తన ప్రభువుచే అందించబడిన ప్రజ్ఞానము నందు శ్రద్ధ గలిగి యున్నాడు. మరియు శ్రద్ధావంతులకుకూడ దానిపై శ్రద్ధ గలదు. వారందరూ ఈశ్వరుని మీదను, దేవతల మీదను గ్రంథముల మీదను, దూత లందరి మీదను శ్రద్ధగలిగి యున్నారు. మాకు

ఎట్టి భేదభావము లేదు. మేము వింటిమి, అంగీకరించితిమి. ఓ ప్రభూ! మేము క్షమాయాచకులము. మరియు మేము మీవైపు మరలి వచ్చెడి వారము." అని వారు చెప్పుదురు.

3. ఈశ్వరుడు ఏ ప్రాణి మీదను శక్తికి మించిన భారము వేయుట లేదు. ఎవరి సంపాదనకు ప్రతిఫలము వారిదే అయివున్నది. ఇదే మాదిరి ఎవరు ఏది చేసినా దానికి వారే బాధ్యులు. ఓ ప్రభూ! మావల్ల ఏదైన పొరపాటుగాని దోషముగాని జరిగినచో మమ్ముల బంధించకుము. మా పూర్వీకులపై వేసిన భారమును మాపై వేయకుము. మమ్ములను పరిశుద్ధులను చేయుము. క్షమించుము

## 40. ధర్మసహిష్ణుత

### 192. మత విషయములో నిర్బంధముకు తావులేదు

1 ధర్మ విషయములో నిర్బంధమునకు అవకాశము లేదు. చెడు మార్గమునుంచి సత్యమార్గము స్పష్టముగా వేరైనది కావున చెడమార్గమును పట్టించు వాసనలను, ఎవరు త్యజించెదరో వారును, ఈశ్వరునిపై విశ్వాస ముంచువారును, దృఢమగు ఆధారమును చేపట్టిన వారగుదురు. ఆ ఆధారము ఎన్నటికి తెగనిది. ఈశ్వరుడు సర్వశ్రుతుడు, సర్వజ్ఞుడు. 2—256

### 193. దూతలందరిపై శ్రద్ధ

1. ఈశ్వరుని యందు మరియు అతని దూతలను అంగీకరించక, వారిలో అంతర్భేధము చూపదలచువారు, మేము కొందరిని అంగీకరించెదము మరికొందరను అంగీకరించమని చెప్పుచూ శ్రద్ధకును అశ్రద్ధకును ఒకమధ్య మార్గమును తీయగోరుదురు.

2. నిజానికి ఇట్టివారలే శ్రద్ధాహీనులు. మరి మేము శ్రద్ధాహీనులకు లజ్జాకరమగు దండనము సిద్ధపరచియుంచితిమి.

3. కాని ఎవరు ఈశ్వరుని యందు మరియు అతని దూతలందరి యందు శ్రద్ధగలిగి, వారిలో ఏ ఒకరిపై నైనను, భేదము చూపరో వారికి మేము తప్పక ప్రతిఫలమును ప్రసాదించగలము. ఈశ్వరుడు క్షమావంతుడు. కరుణానిధి. 4.140–142

## 194. భక్తులది ఒకే సమాజము

1. నిస్సందేహముగా మీ సమాజము (భక్తులది) ఒకే సమాజమై యున్నది. నేను మీ ప్రభువును. అందువలన మత్పరాయణులు కండు.

2. కాని ప్రజలు ధర్మమును తమ మధ్య కత్తిరించి ముక్కలు ముక్కలుగా చేసికొనిరి. మరియు వారు తాము ఏర్పరుచు కొన్న సాంప్రదాయములపై పట్టుదల వహించిరి. 23–57–53

## 195. భక్తులను దూరము చేయకుడు

1. ప్రాతః సాయములందు తన ప్రభువును ప్రార్థించుచూ అతని ప్రసన్నతను కోరు వారిని దూరము చేయకుము. వారి వ్రాతలకు నీవు బాధ్యుడవు కావు. నీకు వారునూ బాధ్యులు కారు. వారిని దూరముచేసినచో, నీవుఅన్యాయపరులలో ఒకడవుకాగలవు. 6–52

## 196. అన్యదేవతలను నిందించకుము

1. ఈ జనులు ఈశ్వరునిగాక ఇతరుల నెవరిని భజించినా, వారిని నిందించకుము. ఎందుకన వారు అజ్ఞానముచేత హద్దులను మీరి ఆలోచించక ఈశ్వరుని నిందింతురు. 6–108

## 197. మంచితనమునకు పోటీ

1. మీలో ప్రతిఒకరికిని, మేము ఒక మార్గమును చూపితిమి. ఒక పద్ధతి కల్పించితిమి. ఇంకను ఈశ్వరుడు తలచినచో మిమ్ములను ఒకే సమాజముగా నుంచువాడు. కాని అతడు మీకిచ్చినదానిచే మిమ్ముల పరీక్షించ దలచెను. కాబట్టి మీరు సత్కార్యములు చేయుటలో ఒకరినొకరు మించ ప్రయత్నించుడు. ఈశ్వరుని చెంతకే మీరు పోవలసియున్నది. అపుడు మీరు ఏ వస్తువు గురించి విరోధించుచుంటిరో, దాని వాస్తవికతను అతడు చూపించగలడు. 5-52

## 198. సుసంవాదము సాధించుడు

1. గ్రంథవంతులతో సౌజన్యపూర్ణమైన చర్చలు జరుపుము. అత్యాచారులను వదలుము. మరియు చెప్పు—

"ఏ గ్రంథము మీపై మరియు నాపై అవతరించినదో దానిమీద మేము శ్రద్ధగలవారము. మాకు భజనీయుడును, మీకు భజనీయుడును ఒకడే. మరి మేము అతనినే శరణు జొచ్చితిమి." 19-63

## 199. మీకు, మాకు ప్రభువు ఒకడే ;

1. నిస్సందేహముగా ఈశ్వరుడే నాకు, మీకు ప్రభువు. అతనినే భజించుడు. ఇదే చక్కటి మార్గము. 43-64

## 200. పూర్వ పశ్చిమములు సమానములు

1. పూర్వ, పశ్చిమములు అన్నియూ ఈశ్వరునివే అందువల్ల మీరు ముఖము ఎటువైపు వుంచినను ఆవైపున ఈశ్వరుడు సుముఖుడై యుండును. 2-115

## 201. స్వర్గము ఎవరికిని పిత్రార్జితము కాదు

1. యూదులు, క్రైస్తవులు, తప్ప ఇతరులెవరును స్వర్గమునకు పోజాలరని వారనుచుందురు. ఇది వారి మనోరథము మాత్రమే. చెప్పు—

"మీరు సత్యవంతులగుచో ప్రమాణము తెండు"

2. ఎందుకు పోజాలరు? ఎవరు తన వ్యక్తిత్వమును ఈశ్వరునకు సమర్పించి, సత్కార్యములు చేయుదురో వారి పుణ్యఫలము ప్రభువుచెంత సిద్ధముగా నున్నది. వారికెట్టి భయమును లేదు. మరి వారు దుఃఖితులు కారు. 2-111-112

# 41. ధర్మవిధులు

## 202. విధిత్రయము

1. ఏకాగ్రతతో ఈశ్వరుని సేవించుమని, నిష్ఠను అతని కొరకే ప్రత్యేకించవలెనని, వారికి ఆజ్ఞ ఇవ్వబడియున్నది. నిత్యము ప్రార్థన, నియమిత దానము చేయవలెను. ఇదే చక్కని ధర్మము. 98-5

## 203. ఉపాసన (అయిదుసారులు నమాజు)

1. వారను మాటలను సహించుము—మరియు మీ ప్రభువు స్తుతితోబాటు అతనిని జపించుము. జయజయనాదము చేయుము. సూర్యోదయానికి పూర్వమును, అస్తమయానికి ముందును, జపముచేయుచుండుము. రాత్రి కొన్ని ఘడియలలోను, దినము యొక్క ఉభయ సంధ్యలలోను ప్రార్థన చేయుము. అందువలన ప్రభువు నిన్ను స్వీకరించును.

## 204. ఆహార సేవనములో ఈశ్వర స్మరణ

1. ఈశ్వరీయ సంకేతములపై మీరు విశ్వసించువారగుచో, ఏ ఆహారముమీద భగవన్నామము ఉచ్చరించబడునో దానినే భుజించుడు.

2. ఈశ్వరుని స్మరణతో అర్పించబడని ఆహారమును భుజించకుడు, అట్లు చేయుట ఆజ్ఞోల్లంఘన మగును. 6-118-121

## 205. ఉపవాసము

1. ఓ, శ్రద్ధావంతులారా! మీ పూర్వులకు వలె మీకు ఉపవాసము విధిహితమొనర్చబడినది. దానివలన మీరు సంయమము గల వారగుదురు.

2. కొన్ని నిర్ణీత దినములందు ఉపవాసము చేయుడు. అయితే మీలో యెవరైనను రోగస్థులగుచో, ప్రవాసమందున్నచో, ఇతర దినములలో అప్పటి లెక్కను పూర్తిచేయుడు. ఒక బీదకు అన్నము పెట్టుడు. అంతకుమించిన సత్కారములు చేసినచో వానికి మంచియే యగును.

3. ఉపవసించినచో అది మీకు హితకరమని తెలుసుకొనుడు:
2-183-184

## 206. పుణ్యయాత్ర

1. ఈశ్వరుని కొరకు పుణ్యయాత్రలును, తీర్థదర్శనములును పూర్తి చేయుడు. మార్గమధ్యమున మీ యాత్రకు అవరోధము కలుగుచో శక్తికొలది సులభముగా లభ్యమగు వస్తువులను మొక్కుగా పంపుడు.

2. యాత్రలో దుష్టాచరణ, దుర్భాషణ, మరియు ఏ విధమగు కలహము చేయరాదు. 2-193-197

—:o:—

# షష్ఠ ఖండము

# 7. సత్యము

## 42. సత్యాసత్య వివేకము

### 207. జ్ఞానాజ్ఞాన భేదము

1. గ్రుడ్డివాడు, దృష్టిగలవాడు సమానులు కారు
2. అలాగే చీకటి – వెలుగులు,
3. ఇంకను ఎండ, నీడలు,
4. అటులనే జీవితుడు మరియు మృతుడు సమానులు కాజాలరు.

35–19–22

### 208. జలఫేన న్యాయము

1. అతడు ఆకాశము నుంచి వర్షమును కురిపించెను. కాలువలు కొలత (ప్రమాణము) ననుసరించి ప్రవహింప దొడగెను. ఆ జలప్రవాహము పొంగును, నురుగును తెచ్చెను. నగల కొరకు అగ్నిలో తప్తము చేయబడు వస్తువు నుంచి (కూడ) నురుగు వచ్చుచున్నది. అది ఎగిరిపోయి ఉపయోగపడు వస్తువుగా(మాత్రము) మిగులుచున్నది. ఈశ్వరుడిచ్చు దృష్టాంతములు ఈ మాదిరివి. 13–17

### 209. సత్యమును అసత్యముతో కలుపకుము

1. సత్యాసత్యములను కలిపివేయకుము. మరియు సత్యమును తెలిసియుండియు, దాచరాదు. 2–42

## 210. సత్యము వ్యక్తుల భోగవాసనల ననుసరించదు

1. సత్యము, వారి వాసనలననుసరించుచో భూమ్యాకాశములు మరియు వాని మధ్యగల సర్వము చెడిపోవును. 23_71

## 211. అ సత్యము యొక్క శిరస్సును భగ్నపరచును

1. మేము సత్యమును, అసత్యముపై విసరివేయుచున్నాము. అది దాని తలను బ్రద్దలు చేయుచున్నది. కాబట్టి తప్పక అసత్యము అంతము కాగలదు. 21-18



# 8. వాక్ శుద్ధి

## 43. సత్య సంధుడు

### 212. చెప్పినట్లు చేయుట

1. ఓ, శ్రద్ధావంతులారా ! మీరు ఆచరించలేని మాటలు చెప్పడ మెందుకు ?

2. ఆచరించని మాటలు నుడువుట ఈశ్వరుని సముఖమున బహు నింద్యములు. 61-2-3

### 213. ఆచరణలోలేని ఉపదేశము

1. ఏమీ ! మీరు సత్కార్యములు చేయుమని ప్రజలకు ఉపదేశము చేస్తూ, గ్రంధపరాయణులై వుంటూ మిమ్ము మీరు మరచిపోవు చున్నారు. ఏమి మీరు మీ బుద్ధి నుపయోగించి పని చేయరా ? 2-44

### 214. దారము త్రుంచిన స్త్రీ

1. ఈశ్వరుని సాక్షిగా నీవు చేసిన వాగ్దానమును పూర్తి చేయుము. దృఢపరచిన శపధములను భంగపరచకుము. నీవే ఈశ్వరుని సాక్షిగా చేసుకొంటివి. నీవు చేయునదంతయు నిశ్చయముగా ఈశ్వరుడు తప్పక తెలుసుకొనుచున్నాడు.

2. శ్రమతో వడికిన దారమును త్రుంచి తునకలుగా చేసిన స్త్రీవలె కాకుము. 16-91-92

## 215. సత్య నిష్ఠ

1. యెవరు సత్య సందేశము తెచ్చిరో, యెవరు దానిని సత్యమని విశ్వ సించిరో, వారు ధర్మపరాయణులు.

2. వారు కాంక్షించిన వంతయూ, వారి ప్రభువువద్ద నున్నది. ఇది సత్కార్యములు చేయువారికి లభించు ప్రతిఫలము

# 44. శుభమైన మాట

## 216. శుభాశుభ వాక్యముల ఉపమానము

1. ఈశ్వరుడు శుభవచనముల కిచ్చిన ఉపమాన మెట్టిదో నీవు చూడ లేదా? గట్టు మొదలు, ఆకాశ వ్యాప్తముగా శాఖలుగల ఉత్తమ జాతి వృక్షమే దానికి దృష్టాంతము—

2. ఆ వృక్షము ప్రతిక్షణము తన ప్రభువు ఆజ్ఞచేఫలము లిచ్చు చుండును. ఈశ్వరుడు ప్రజల గుణపాఠము కొరకు ఇట్టి దృష్టాంతము నిచ్చుచున్నాడు.

3. మరియు దుష్టజాతి వృక్షము అశుభవచనములకు దృష్టాంతము_ దానికి స్థిరత్వమేలేదు. అది భూమినుంచి పైపైనుండియే, పెరికి వేయ బడుచున్నది. 14_24_26

## 217. శుభము పలుకుము

1. మాదాసులతో సర్వోత్తమమగు మాటలనాడుమని చెప్పుము. నిస్సందేహంగా సైతాను, వారిమధ్య కలహ బీజములు నాటుచున్నారు నిజానికి సైతాను మానవునకు ప్రత్యక్ష శత్రువు. 17-53

## 218. మంచి మాట

1. ఈశ్వరుని వైపుపోవుదమని, సత్కృత్యములు చేయమని మరియు తన వ్యక్తిత్వమును ఈశ్వరుని ఆజ్ఞకు అధీన మొనరించితిమని చెప్పుట ఇట్టి వారికన్న మరెవరి మాటలు ఉత్తమము లగును? 40-41-33

## 219. తిన్నని మాట

1. ఓ శ్రద్ధావంతులారా! ఈశ్వరునికి భయపడుడు. తిన్నని మాటలు చెప్పుడు. 33-70

# 45. నింద కూడదు

## 220. చెడు మాటలను నోటినుండి రానీయకుము

1. ఒకరిపై అత్యాచారములు జరిగినప్పుడు తప్ప చెడుమాటలను వాలుకపై రానిచ్చుట, ఈశ్వరునకు నచ్చదు. ఈశ్వరుడు వినువాడు-తెలుసుకొనువాడును.

2. నీవు మంచిని ప్రకటించినా, ప్రకటించకపోయినా చెడును క్షమించుము. నిస్సందేహముగా ఈశ్వరుడు క్షమించువాడు. మరియు సర్వశక్తిశాలి. 4-148-149

## 221. నిందింపకుడు

1. ఓ శ్రద్ధావంతులారా! పురుషులు పురుషులను, స్త్రీలు స్త్రీలను ఎగతాళిచేయరాదు. వారువారికంటె ఉత్తములై యున్ననుసరే ఒకరిపైనొకరు దోషారోపణలు చేసుకొనరాదు. మరియు అవమాన కరమగు పేర్లతో సంబోధించవలదు. శ్రద్ధకలిగిన తరువాత

పాపమును పేరేపేద్దది. ఎవరు ఇట్టి ప్రవృత్తినుంచి విముఖులు కారో వారే అత్యాచారులు.

2. ఓ శ్రద్ధావంతులారా! అధికముగా సంశయించుట నుండి, తప్పుకొనుడు. నిస్సందేహంగా కొన్ని సంశయములు పాపములే. రహస్య శోధకునివలె ఏఒకరి వెంటను పడకుడు. మరియు మీలో ఒకరిపై నొకరు దోషారోపణలు చేసుకొనకుడు. మీలో ఎవరికైనను చనిపోయిన సోదరుని మాంసము తినుట రుచించునా? మీకు అసహ్యము కలుగదా? మీరు ఈశ్వరునికి భయపడుడు. నిస్సందేహంగా ఈశ్వరుడు పశ్చాత్తాపమును స్వీకరించువాడు. మరియు కరుణామూర్తి. 49-11-12

## 222. వివాదము నుండి తప్పుకొనుడు

1. మా వచనములను గూర్చి వ్యర్థమగు చర్చలు జరుపుచున్న లోకుల నుండి, అచట నుండి వారు వేరే విషయాంతరముకు వెళ్ళు వరకు మీరు వారి చెంత నుండి తొలగుడు. ఒకవేళ సైతాన్ మిమ్ము మరపులోపడవేసినచో, జ్ఞప్తికి రాగానే మీరు ఆ అత్యాచారుల వద్ద కూర్చొనకుడు. 6-68

## 223. వ్యర్థపు మాటల నుండి తప్పుకొనుము

1. శ్రద్ధావంతులు వ్యర్థపు మాటలు వినినపుడు తప్పుకొనుచు "మా కర్మము మావెంట, మీది మీ వెంట, మీకు నమస్కారము. మేము అజ్ఞులతో కీచులాడ దలచలేదు" అని అందురు. 28-55

## 224. ధర్మనిందను వినరాదు

1. ఈశ్వరీయు వచనములను మన్నించక, వాటిని ఎగతాళి చేయువారు. ఇతర ప్రసంగములో పడు వరకు నీవు అచట కూర్చొన

రాదని గ్రంథములో ఆదేశము అందించబడినది. దీనిని పాటించ కున్న నీవు కూడ వారి వలె కాగలవు 4-140

## 225. నిందించు వారిగతి

1. దోషము లెన్నువానికి, కొండెములు చెప్పువానికి, దుర్భాషలాడు వానికి తిరస్కారము
2. ఎవడు ధనమును గూడబెట్టి దానిని లెక్కించుకొను చుండునో,
3. వాడు ఆ ధనము తనను సదా బ్రతికించునను భ్రమతో, నున్నాడు.
4. యెప్పటికి అట్లు జరుగదు. ఆ ధనమును మండుచున్న దానిలో పడవేయ బడును.
5. ఆ మండుచున్న దేమిటో నీవు ఏ మెరుగుదువు?
6. అది ఈశ్వరుడు రగులు కొలిపిన అగ్ని.
7. అది మానసములపై పొంగి వచ్చుచున్నది.
8. నిశ్చయముగా వారు ఆ నిప్పుచే మూయబడుదురు.
9. సుదీర్ఘములగు స్తంభములలో 104-1-9



# ౧౮. అహింస

## 46. న్యాయ బుద్ధి

### 226. ఒక మనుష్యుని కాపాడుట, అనగా జగత్తును కాపాడుట.

1. ఒక ప్రాణికి జరిగిన హానికి బదులుగా లేక ప్రపంచములో పెద్ద కల్లోలము రేకెత్తించ బడుచున్నపుడు తప్ప ఇతర కారణములకు లోనై ఒక మానవుణ్ని హత్యగావించిన వారు సకల మానవ జాతిని హత్యగావించిన వారగు చున్నారు. అలాగే ఒక ప్రాణి ప్రాణమును కాపాడినచో, వారు అఖిలమానవ జాతికి జీవనము ఇచ్చినట్లగునని మేము ఇస్రాయిల్ పుత్రులకు ఆజ్ఞఇచ్చితిమి
5-35.

### 227. కలహములు వ్యాపింప చేయకుడు

1. మన ప్రభువును గద్గద కంఠముతోను, మౌనపూర్వకముగాను. పిలువుము నిస్సందేహముగా అతడు మర్యాదను ధిక్కరించు వారిని ఇష్టపడడు.

2. జగత్తు సంస్కరించబడి ఉన్నపుడు కలహములు లేపకుడు. ప్రభువును ఆశాభయములతో పిలువుము. ఈశ్వరుని కృపా కటాక్షములు సత్కృత్యములు చేయువారికి చేరువగా వున్నవి.
7-55-56.

## 228. ద్వేషించు వారిపై కూడా అన్యాయము చేయకుము.

1. ఓ శ్రద్ధావంతులారా! ఈశ్వరునికొరకు సత్యసంధులై న్యాయము వైపు సాక్ష్యమిచ్చు వారుగానుండుడు. ఏ ఒకరి ద్వేషము మిమ్ము న్యాయము జరుపలేని స్థితిలో ఉత్తేజితులను చేయకుండుగాక, న్యాయము చేయుడు. ఈ ధర్మపరాయణతయే, మిమ్ము (ఈశ్వరుని) సన్నిహిత పరచగలదు. ఈశ్వరుని గురించి మీ కర్తవ్యమును పూర్తిచేయుడు. నిస్సందేహముగా ఈశ్వరుడు మీరు చేయు కార్యములను బట్టి తెలియబడుచుండును. 5-9

## 229. మైత్రికి సదాసిద్ధముగా నుండుడు.

1. వారు సంధివైపు మ్రొగ్గినచో ఈశ్వరునిపై విశ్వాసముంచి, నీవు కూడా అటువైపుమ్రొగ్గుము. నిస్సందేహముగా అతడే సర్వశ్రోత సర్వజ్ఞుడు.

2. మరియు వారు నిన్ను మోసగించ దలచినను, నీకు ఈశ్వరుడు (నీవాడై యుండుట)చాలు. అతడే తన సహాయము చేతను, మరియు భక్తుల ద్వారాను నీకు బలము చేకూర్చును.

3. అతడు శ్రద్ధావంతుల హృదయములను పరస్పరము జోడించెను. భూమి యందలి సర్వస్వము వెచ్చించినను నీవు వారి హృదయములను జోడించలేవు. కాని ఈశ్వరుడు వారి హృదయములను కలిపివేసెను. నిస్సందేహంగా, అతడు సర్వజేత, సర్వవిదుడు. 8-61-63

# 47. న్యాయము కంటె క్షమ శ్రేష్ఠము

## 230. సహనమే శ్రేష్ఠ మార్గము

1. ప్రతీకారము తలచుకొన్నచో, నీకు కల్గిన నష్టము మేరకే చేయుము సహించతలచితివా, సహించువారికి సహించడమే మంచిది.

2. నీవు మాత్రము సహనమే కల్గియుండుము. ఈశ్వరుని సహాయత వల్లనే నీకు సహనము కల్గును. నీవు వారి విషయమై దుఃఖితుడవు గాకుము. ఇంకనూ వారి కపట చర్యలకు వ్యధనొందకుము.

3. నిస్సందేహముగా ఈశ్వరుడు అతనితో భయపడువారి వెంట మరియు మంచి పనులు చేయు వారివెంట నుండును.

16-126-128

## 231. క్షమించుటయే శ్రేష్ఠము

1. వారు తమపై అత్యాచారములు జరిపినపుడు ప్రత్యుత్తర మిచ్చుచున్నారు.

2. చెడుపనికి ప్రతీకార మొనర్చుట, అంతటి చెరుపునే చేయును. అందువల్ల ఎవరైనను క్షమించి పరివర్తన చేయ గల్గినచో, దాని ప్రతిఫలము ఈశ్వరుని ఆధీనమునందు గలదు. నిస్సందేహముగా ఈశ్వరుడు అత్యాచారులను సహించడు. 42-39-40

# 48. అహింస యొక్క నిష్ఠ

## 232. క్షమ మరియు ఈశ్వరాశ్రయము.

1. క్షమించుటకు అభ్యాసము చేసుకొనుము. సత్కార్యములు చేయుటకు ప్రేరణ నిమ్ము, మరియు మూర్ఖులతో దూరముగా నుండుము

2. సైతాన్ నిన్ను రెచ్చగొట్టినచో ఈశ్వరుని శరణువేడుము నిస్సం దేహంగా ఈశ్వరుడు సర్వమును వినువాడు సర్వజ్ఞుడు.

3. (మరి) ఈశ్వర నిష్ఠకు సైతాన్ స్పర్శచే వికారభావములు తల యెత్తినను, వారు వెంటనే జాగృతులగు చున్నారు. మరియు వారికి కనువిప్పు కలుగుచున్నది. 7-199-201

## 233. చెరుపునకు మంచితనముతో ప్రతీకారము

1. చెరుపును బహు మంచి వర్తనతో ఎదుర్కొనుము. మేమువారు చెప్పునది బాగుగా ఎరుగుదుము.

2. మరియు చెప్పు:— ఓ ప్రభూ! నేను సైతాన్ యొక్క దుష్ట ప్రేరణ నుంచి రక్షింప బడుటకు నీ ఆశ్రయమును కోరుచున్నాను 23-96-98

## 234. మేము క్షమాయాచకులము. మేము క్షమించెదము.

1. క్షమించుట మరియు మరచిపోవుట ప్రజల కర్తవ్యము. ఏమీ! ఈశ్వరుడు క్షమించవలెనని మీరు కోరుట లేదా? ఈశ్వరుడు క్షమా శీలుడగు కరుణా నిధి. 24-22.

## 235. శత్రువులు మిత్రులు కాగలరు

1. సత్కర్మములు మరియు దుష్కర్మములు సమానములు కాజాలవు. సర్వోత్తమమగు సద్వర్తనముచే దుష్టత్వమును దూరము చేసి కొనుము. అపుడు అకస్మాత్తుగా నీ శత్రువులు నీకు పరమ మిత్రులు కాగలరు.

2. దృఢ నిశ్చయము కలవారికి ఇటువంటి స్థితి ప్రాప్తమగు చున్నది. మరియు గొప్ప భాగ్యవంతులగు వారికే ఇట్టి దశకల్గుచున్నది.

## 236. ప్రేమ ఎట్లు ప్రాప్తమగును?

1. నిస్సందేహముగా ఎవరు శ్రద్ధగలవారో, ఎవరు సత్కార్యములు చేసిరో, వారిలో ఆ కృపాలుడు ప్రేమను ఉత్పన్నము చేయు చున్నాడు. 19-90

# 49. సహా యోగ వృత్తి

## 237. పొరుగు వారి యెడ చూపు ధర్మము

1. న్యాయ దినమును అంగీకరించని మనుష్యుని నీవు చూచితివా ?
2. ఇట్టివాడే అనాధలను నెట్టివేయును.
3. బీదలకు అన్నము పెట్టుటకు ఎవరిని ప్రోత్సహించడు.
4. కాబట్టి (నిష్ఠలేని) ప్రార్థనచేయువారికి తిరస్కారము.
5. వారు తమ ప్రార్థనలో అసావధానులై ఉందురు.
6. మరియు మిథ్యా చారులు.
7. మరియు తమ పొరుగునగల వారికి దైనందినము ఉపయోగపడు చిన్నవస్తువులు కూడ నివ్వనివారు. 107-1-7.

## 238. సంయమమును, దయను పరస్పరము బోధించు కొనుట.

1. ఏమీ ! మేము అతనికి రెండు నేత్రము లివ్వలేదా ?
2. జిహ్వయు మరియు రెండు పెదవులు

3. మరియు అతనికి రెండు మార్గములు చూపించితిమి.

4. అయినను అతడు ఒడ్డును ఎక్క లేదు.

. ఆ ఒడ్డు యేమిటో నీవు ఏమి తెలుసుకొంటివి ?

6. (అది) బద్ధులను ముక్తులను చేయుట.

7. ఆకలి దినములో అన్నము పెట్టుట.

8. సన్నిహితులగు అనాధలకును,

9. దుమ్ములో పడియున్న పేదలకు అన్నము పెట్టుట.

10. అదిగాక శ్రద్ధగల వారివెంటను, సహనము గలవారి వెంటను, మరియు, పరస్పరము కరుణను ప్రబోధించు వారివెంటను కలిసి యుండుట. 90-8-17

## 239. సత్యమును, ధైర్యమును పరస్పరము బోధించు

1. కాలము యొక్క శపధము.

2. నిశ్చయముగా మనుష్యుడు నష్టపడగలడు.

3. శ్రద్ధావంతులగు వారు, సత్కార్యములు చేయువారు, మరియు పరస్పరము ధైర్యము కరుణ కలిగియుండవలెనని బోధించుకొను వారు తప్ప. (ఇతరులు) 103-1-3

## 240. పరస్పర సహాయత

1. ........సత్కృతిలోను, సంయమముగా ఉండుటలోను ఒకరు మరొకరికి సహాయపడుడు. పాపములోను అత్యాచారములోను ఒకరికొకరు సహాయము చేసుకొనకుడు. 5-3

### 241. సత్కార్యములలో పోటీ పడుడు

1 ప్రతివ్యక్తికి ఒక దిశ గలదు. అతను దానివైపునకు అభిముఖుడగును. కాన మీరు సత్కార్యాచరణలో అగ్రగాములుగానుండుడు. మీరు ఎచ్చట నున్నను ఈశ్వరుడు మిమ్ము ఒకే చోటికి చేర్చగలడు. ఈశ్వరుడు నిస్సందేహముగా సర్వకర్మ సమర్థుడు. 2-14-8

## 50. అసహకారము

### 242. దుర్జనుల మాటలు వినకుము

1. ఈశ్వరుడు లేడని వాదించు వారు చెప్పునది వినకుము.
2. నీవు మెత్తదనము చూపుచో వారు మేము గూడ మెత్తబడదంచితిమందురు.
3. హెచ్చుగా శపథములు చేయువాని మాటలు వినకుము,
4. అట్టివారు దోషైక దృష్టికలవారు, చాడీలు చెప్పు వారు-
5. పుణ్యకార్యములను నిరోధించువాడు మరియు మర్యాద నతిక్రమించు పాపి.
6. క్రూరుడు, వీరందరికంటె క్షణ క్షణముకు వేషములు మార్చువాడు,
7. వీరందరు సంపత్తి, సంతతి గలదను గర్వముతో నుందురు. 68-8-14

## 51. అనివార్యమగు ప్రతీకారము

### 243. ప్రతీకారము లేనిచో పవిత్ర క్షేత్రములు ధ్వంసమయ్యేవి.

1. యుద్ధము ఎవరిపై చేయబడుచున్నదో, వారికి యుద్ధము చేయు అనుమతిఇవ్వబడినది. వారిపై అత్యాచారములు జరుగుచుండుటయే

దీనికి కారణము. నిస్సందేహముగా ఈశ్వరుడు అట్టి వారికి సహాయపడుటకు శక్తిశాలిగా నున్నాడు.

2. ఈశ్వరుడే మా ప్రభువు అన్నంత మాత్రమున వారు ఇండ్ల నుండి వెళ్ళగొట్టబడిరి. అపుడు ఈశ్వరుడు అచ్చటి ప్రజలను విడదీయకున్నచో సాధువుల ఏకాంత స్థలములు, క్రైస్తవుల పూజా స్థానములు, యూదుల ఉపాసనా క్షేత్రములు ఈశ్వరున్ని బాగా స్మరించు మసీదులు, పడగొట్టబడేవి. నిస్సందేహముగా ఈశ్వరుడు తనకు సహాయము చేయు వారికి తప్పక సహాయము చేయుచున్నాడు. నిస్సందేహముగా ఈశ్వరుడు బలశాలి, సర్వశక్తుడు.

22-39-40

## 244. ధర్మసంరక్షణార్థము పరిమితమగు ప్రతీకారము

1. భగవన్మార్గములో ఇల్లు, వాకిలి వదలిన వారు చనిపోయినను, చంపబడినను వారికి ఈశ్వరుడు తప్పక చక్కని ఆధారము నొసగుచున్నాడు. నిశ్చయముగా ఈశ్వరుడే అందరికన్న శ్రేష్ఠమగు జీవిక నిచ్చు వాడు.

2. వారిని, వారికి ప్రియమగు ప్రదేశములలో తప్పక ప్రవేశపెట్టగలడు. నిస్సందేహముగా ఈశ్వరుడు సర్వజ్ఞుడు సర్వము సహించువాడు.

3. అయితే తనపై జరిగిన అత్యాచారము మేరకే వ్యక్తి, ప్రతీకారము గైకొనవలెను. తదనంతరము ఆ వ్యక్తిపై మళ్ళీ అత్యాచారము జరిగినచో ఈశ్వరుడు అతనికి తప్పక సహాయము చేయును. ఈశ్వరుడు దోషములను మరచిపోవు పరమోదారుడు.

22-58-60



# 21. అస్వాదము

## 52. రసనాజయము



### 245. ఒకే అన్నముతో విసుగు

1. మీరు మూసాతో "ఓ మూసా! మేము ఒకే విధమగు భోజనముతో సంతోషము చెందజాలము. మా కొరకు భూమి నుండి ఉత్పత్తి కాగల కాయలు, కూరలు, గోధుమలు, ఉల్లి, పప్పులు మొదలగు వస్తువులు ఉత్పన్నము చేయుటకు మీ ప్రభువును ప్రార్థించమంటిరి. అపుడు మూసా, ఏమీ! మీరు శ్రేష్ఠమగు పదార్థముల వదలి, తుచ్ఛమగు వస్తువులను గైకొనదలచితిరా? అయినపుడు మీరు ఏదైన పట్టణముకు వెళ్ళుడు. అచ్చట మీరు అర్థించు వస్తువులు లభ్యమగును. అని చెప్పెను.

రూ. ౩౨౦౦

—:o:—

# 21. బ్రహ్మచర్యము

## 53. పవిత్రత

### 246. నేను పవిత్రుడ ననువాడు

1. ఏమీ ; నీవు తమకు తామే పవిత్రుల మనుకొను వారిని చూచితివా ? వస్తుతః ఈశ్వరుడు తన అభీష్టము కొలది ఎవరి నైననూ పవిత్రుని చేయగలడు. దండించుటలో ఖర్జూరపు గింజపై గల రేఖ మాత్రము అన్యాయము గూడ జరుగనీయడు. 4_49

### 247. ఈశ్వరుని కృపవలననే పవిత్రత

1. ఓ శ్రద్ధావంతులారా ! సైతాను అడుగుజాడలను అనుసరించకుడు. అట్లనుసరించు వానిని అనుచితమును మరియు లజ్జాహీనమగు పనులను చేయుటకు ఆ సైతాన్ ఆజ్ఞాపించుచున్నాడు. ఈశ్వరుని దయ, కరుణ లేకున్నచో మీలో ఎవరును, ఎన్నటికిని పవిత్రులు కాజాలరు. ఈశ్వరుడు తన కిష్టులగు వారినే పవిత్రులను చేయు చున్నాడు. అతడు సర్వజ్ఞుడు, సర్వశ్రోత. 24_21

### 248. సూక్ష్మదోషములు ఈశ్వరుని కృప వలన తొలగును.

1. కొందరు గొప్ప పాపముల నుండియు చెడుమాటల నుండియు తప్పు కొను చున్నారు. కాని సూక్ష్మదోషములు ఉండిపోవుచున్నవి. నిస్సందేహముగా నీ ప్రభువు అధికముగా క్షమించువాడు మీరు మాతృ గర్భములో నున్నపుడును, మరియు మిమ్ముల పుట్టించి

నప్పటి నుండియు. అతడు ఓస్పు బాగా ఎఱుగను. కాబట్టి మీరు మీ పవిత్రతను చాటు కొనకుడు. ఎవరు సంయమము గలవారో, ఈశ్వర పరాయణులో వారిని అతడు బాగుగా ఎరుగును.
53-32

**249.** అంతర్ బాహ్యాపాపముల నుండి తప్పించుకొనుడు.

1. అంతర్బాహ్య పాపములను విసర్జించుకొనుడు. పాపములు చేయు వారికి, వారి చేష్టలకు తగిన ప్రతిఫలము తప్పక ఇవ్వబడును.
6-120.

**250.** పవిత్రత మరియు ప్రభువు స్మరణ

1. నిస్సందేహముగా పవిత్రతను చేపట్టిన వాడు సఫలుడైనాడు.
2. అతడు తన ప్రభువు యొక్క నామ స్మరణ, మరియు ప్రార్థన చేసి యున్నాడు. 87-14-15.

**251.** శుభాశుభ వివేకమును మేల్కొల్పుడు

1. జీవుని యొక్కయు అతనిని వికసింపచేయు వాని యొక్కయు శపథము.
2. అతడే జీవునికి శుభాశుభ వివేకము యొక్క అంతః ప్రేరణ కల్గించెను.
3. నిస్సందేహముగా ఎవరు తన మనస్సును పరిశుద్ధ మొనర్చుకొనిరో, వారే పరిశుద్ధులు మరియు తన మనస్సును ఎవరు అధః పతన మొనర్చుకొనిరో, వారు అసఫలులు. 91-7-10

## 252. శీల రక్షణ

1. ఓ అదాము పుత్రులారా ! నిస్సందేహముగా మేము మీకు వస్త్రములనిచ్చితిమి. వానిచే మీ మర్మ స్థానములు కప్పబడుచున్నవి. అది శోభాకరము గూడ. కాని సంయమ మను వస్త్రమే శ్రేష్ఠతమము. ఇది ఈశ్వరీయ సంకేతము. దానిచే ఈ ప్రజలు ఉపదేశములు పొందెదరు !

2. ఓ ఆదాము పుత్రులారా ! సైతాను మీ తల్లిదండ్రులను స్వర్గము నుంచి వెడలగొట్టించినట్లును వారి మర్మ స్థానములు కనిపించుటకు వస్త్రములను విడిపించినట్లును మిమ్ముల చరిత్ర భ్రష్టులను చేయుటకు బెదరించకుండుగాక ! అతడు మరియు అతని పరివారము మీకు కనబడకుండా మిమ్ము చూడగలరు. నిస్సందేహముగా మేము సైతానును శ్రద్ధాహీనులకు మిత్రునిగా చేసితిమి.

3. శ్రద్ధాహీనులగు వారు ఏదో ఒక చెడుకార్యము చేసినపుడు, మా తాత తండ్రులు ఇట్లేచేసిరి. ఈశ్వరుడే మాకు ఇట్లు చేయుటకు ఆజ్ఞాపించెను, అని పలుకు చుందురు. కాని ఈశ్వరుడు చెడు కార్యమును చేయుటకు ఆజ్ఞ యిచ్చువాడుకాడు. ఏమీ ! ఈశ్వరుని గురించి మీకు తెలియని మాటలను మీరు పలికెదరా?

7-26-28

## 253. అధికారము లేని సన్యాసము

1. మేము దూతలను ఒకరివెంట ఒకరిని వరుసగా పంపితిమి. తదనంతరము మరియమ్మ పుత్రుడైన ఈసా (ఏసు)ను పంపితిమి. అతనికి "ఎంజేల్" గ్రంథమును ప్రసాదించితిమి. మరియు అతని

ననుసరించు వారి హృదయములలో మార్దవమును, కరుణను కల్గించితిమి. వారు తమకు తాముగా సన్యాసమును, ఏకాంత జీవనమును చేపట్టిరి వారికది ఆవశ్యకమని మేము చెప్పలేదు. కాని ఈశ్వర ప్రసన్నతకై వారే అట్లు చేసిరి, మరియు దానిని వారు ఎట్లు నిర్వహించవలెనో అట్లునిర్వహించలేదు. అయినను వారిలో శ్రద్ధావంతులకు తగిన ప్రతిఫలము నిచ్చితిమి. కాని వారిలో పెక్కురు దురాచారులుగానే యుండిరి. 57-27

## 54. బ్రహ్మచారి యగుజాను

ఆ చోటున జక్రియా తన ప్రభువును, (ఓ ప్రభూ!) నీవు నాకు పవిత్రమగు సంతానమును అనుగ్రహించుము. నిస్సందేహముగా నీవు నా ప్రార్థనను ఆలకించు వాడవు అని మొరపెట్టు కొనెను.

ఉపాసనా స్థానమున జక్రియా కుర్చుండి ఉపాసించు చున్నపుడు దేవదూతలు అతనిని సంబోధించి ఇట్లు పలికిరి.

"నీకు జాన్ (యహ్యా) యను పేరుగల పుత్రుడు కలుగును. అతడు ఈశ్వరీయ వాణిని ఋజువు పరచు వాడు. ఉదాత్తుడు బ్రహ్మచారి, సందేష్ట, సత్కార్యములు చేయువాడు కాగలడు। ఇది ఈశ్వరుడు నీకిచ్చిన శుభసందేశము". 3-38-3॥

## 56. ఈశ్వరుడు మీ యెదుట గలడని తలచి కోరికలను నిగ్రహించుకొనుడు

ఆ గొప్ప విపత్తు వచ్చిననాడు

ఆ దినమున మనుష్యుడు తాను చేసిన కృషిని జ్ఞప్తికి తెచ్చుకొనును.

3. మరియు ప్రత్యక్షముగా చూచుటకు నరకము అతని ముందుకు తీసుక రాబడును.

4. ఎవరు ద్రోహము చేసిరో

5. (ఎవరు) ఐహిక జీవనమునకే ప్రాధాన్యము నిచ్చిరో,

6. (అట్టివారికి) నరకమే నివాస మగును.

7. తన ప్రభువు సమక్షమున ఎవరు నిలబడుటకు వెరచిరో, మరియు విషయ వాసనల నుండి మనసును నిగ్రహించిరో,

8. నిస్సందేహముగా వారి నివాసము స్వర్గమే, యగును. 79-34-41



# 22. శుద్ధ జీవిక

## 53. ఆస్తేయము

### 56. వడ్డీ నిషేధము

వడ్డీ తీసువారు సైతాను స్పర్శచే మతిచెదరిన వ్యక్తులవలె నిలచి వుందగలరు. వడ్డీతీసుకొనుట వ్యాపారము వంటిదని అనుకొనుట వల్ల వారు ఇట్లు అంటూవున్నారు. కాని ఈశ్వరుడు వర్తకమును విధాయకమని వడ్డీని నిషిద్ధమనియు అనెను. కాబట్టి యెవరు వారి ప్రభువుచే ఉపదేశములు పొంది, వడ్డీ నుంచి పరావృత్తులగుదురో ఇంతకు పూర్వము వడ్డీ ద్వారా తీసుకొన్న సొమ్ము వారిదై దాని తీర్పు ఈశ్వరాధీనములో నుండును. కాని ఉపదేశము అందిన పిదప కూడ వడ్డీతీసుకొను వారు అగ్నిలో త్రోసివేయ బడుదురు. మరియు వారు సదా దానిలో ఉండగలరు.

ఈశ్వరుడు వడ్డీని విఫలమొనరించును, దానములను సుఫలము గావించును. కృతఘ్నులను, దురాచారులను ఈశ్వరుడు ఇష్టపడడు. 2-275-276.

### 257. ధనమును వడ్డీకివ్వక దానములో నిమ్ము

మీధనము ప్రజల ధనములో చేరి అభివృద్ధికాగలదని మీరు దానిని వడ్డీకిచ్చుచున్నారు. కాని గుర్తించుకొనుడు. ఈశ్వరుని దగ్గర అది పెరుగుట లేదు పవిత్ర హృదయముతో ఈశ్వర ప్రసన్నత నభిలషిస్తూ నియమిత దానము చేయువారి ధనము ఈశ్వరుని వద్ద ఇనుమడించుచున్నది. 30-39.

## 258 సరియగు తూకము - కొలత

1. మేము మిదియన్ వైపు అతని సోదరుడగు శోయేబును పంపితిమి. అతడు "ఓ సోదరులారా? ఈశ్వర భక్తులు కండు. అతడు తప్ప మీకు వేరొక భజనీయుడు లేడు. తూకము వేయుటలో మరియు కొలత చేయుటలో తగ్గించుట తగదు." మీరు నిశ్చింతతో ఉన్నట్లు నా కగుపడుచున్నారు. కాని మీ అందరిపై వచ్చి పడనున్న ఆ దినము యొక్క ఆపత్తును గురించి (నేను) భయ పడుచున్నానని నుడివెను.

2 మరియు ఓ సోదరులారా! న్యాయముతో నిండుగా కొలత, తూకము చేయుడు. ప్రజల సొత్తుకు నష్టము రానీయకుడు. కలహములను పెంచుచు పృధ్విపై సంచరించకుడు.

3. మీరు శ్రద్ధావంతులగుచో ఈశ్వరుడు ప్రసాదించిన దానిలో (మిగులునదే) మిక్కిలి అధికహితావహము అంటే నేను మీ మీద నిరీక్షణచేయు వాడను గాను.

## 259. మోసపు సంపాదన, సైతాన్ సంపాదనయే

1. కొలత, తూకములో తగ్గింపు చేసే వారికి తిరస్కారము.

2. వారు ప్రజలనుంచి నిండుగా కొలచి తీసుకొనుచున్నారు.

3. మరియు ప్రజలకు ఇచ్చేటప్పుడు కొలతలోను, తూకములోను తగ్గించుచున్నారు. 83-1-6

## 260. "ఆశపడకుము"

1. ఈశ్వరుడు ఏ వస్తువు నిచ్చి మీలో ఒకరి మీద (అతనికి) రెండవ వానికి విశిష్టత చేకూర్చెనో దానిని ఆశించకుడు. 4-32

# 55. అసంగ్రహము

## 261. లోభము హానికరము

1. వినుము, ఈశ్వరార్థము ఖర్చు చేయుమని పిలిచినపుడు, మీలో కొందరు ప్రలోభపడుదురు. అట్టివారు తమ పట్లనే లోభము చూపుకొనుచున్నారు. ఈశ్వరుడు నిరపేక్షుడు. మీరు దీనులై విముఖులగుచో, ఈశ్వరుడు మీ స్థానములో ఇతరులను తేగలడు. అపుడు వారు మీ వంటి వారుగా నుండరు. 47_38

## 262. లోభులు లోభమునే నేర్పుదురు.

1. మీరు ఈశ్వరుని భజింపుడు. మరెవరిని తోడిగా చేయకుడు, తల్లి తండ్రుల యెడ సౌజన్యముతో ప్రవర్తింపుడు. బంధువులు, అనాథలు, బీదలు, పొరుగునగల పరిచితులు, లేక అపరిచితులు, సహచరులు, సహయాత్రికులు, మీ అధీనములో గల భృత్యుల యెడ సౌజన్యముతో మెలగుడు. నిస్సందేహముగా ఈశ్వరుడు దురహంకారులను, ఆత్మ శ్లాఘులను సహించడు.

2. ప్రలోభులకును, లోభమున్ను ఇతరులకు నేర్పువారికిని, ఈశ్వరుడు కరుణించి ఇచ్చిన దానిని దాచుకొను కృతఘ్నులకును, మేము అవమాన కరమగు దండన విధించి యున్నాము. 4-36_37.

## 263. లోభుల దుర్గతి

1. ఈశ్వరుడు ప్రసాదించిన సంపదను వినియోగించుటలో లోభము చూపువారు తమకది హితకరమను భ్రమలో నుండరాదు. అది వారికి కీడే కలిగించును. వారు ప్రలోభించి ఉంచిన ధనాన్ని దండలుగా కూర్చి అంతిమ దినమందు వారి కంఠమున వేయ

బడును. భూమ్యాకాశముల యొక్క వారసత్వము ఈశ్వరునిదై యున్నది. ఈశ్వరునికి మీరు చేయు పనులన్నియు విదితములు.

## 264. సువర్ణ సంగ్రాహకులు.

1. ఓ శ్రద్ధావంతులారా! గ్రంథవంతులు, విద్వాంసులు, మరియు మతస్థులు ప్రజల ధనాన్ని అన్యాయముగా అపహరిస్తూ, వారిని ఈశ్వరుని మార్గము నుండి అడ్డగించుచున్నారు. వెండి, బంగారములను కూడబెట్టి భగవన్మార్గమున ఉపయోగించనివారికి అతి దుఃఖకరమగు దండనకాగలదను సందేశము అందించుడు.

## 265. కదలని వారు

1. ఓ శ్రద్ధావంతులారా! భగవన్మార్గములో పయనించుడని మీతో చెప్పినపుడు మీరు మీ స్థానములను అంటి పెట్టుకొని ఉంటిరి. ఏమీ? పరలోకమును వదలి ఇహలోక జీవనములో మీరు ప్రసన్నులైతిరా? ఇహలోక జీవనము యొక్క సాధన సామగ్రి పారలౌకికము కంటె మిక్కిలి తుచ్ఛమైనది. 9-38

## 266. ఖారూన్ యొక్క కరుణా గాథ

1. ఖారూన్ మూసా సోదర వర్గములోని వాడు. అతడు మూసాకు వ్యతిరేకముగా విద్రోహమొనరింప సాగెను. మేము అతనికి అమితమగు ధనాగారముల నొసగితిమి. వాటి తాళపుచెవులు మోయుటకు ఎందరో బలశాలురు అలసిపోవు చుండిరి. "నీవు మిడిసి పడకుము. నిశ్చయముగా మిడిసిపడువారు ఈశ్వరునికి ఇష్టులు కారవి" అతని బంధువర్గము చెప్పిరి.

౨. "మరియు నీకు ఈశ్వరుడు ఇచ్చినదాని నుంచి పరలోక జీవన మన్వేషించుము. ఈలోకము నుంచి పరలోకముకు తీసుకొని పోవు నీ భాగమును మరువకుము. ఈశ్వరుడు నీకు ఉపకారము చేసినట్లు నీవు ఉపకారము చేయుము. భూమి మీద కలహము కాంక్షించె వాడవు కాకుము. ఈశ్వరునికి కలహకారులు ఇష్టులు కారు" (అని కూడ చెప్పిరి).

౩. అపుడు అతడు (ఖారూన్) ఈ ధనమైతే నాకు ఒక ప్రజ్ఞ వల్ల లభించినదని నుడివెను. కాని ఏమి, అతనికి తెలియదా ? ఈశ్వరుడు ఇంతకు పూర్వము అతనికంటె అధిక బలవంతులగు అనేక జాతులను హత మొనర్చెను వారు సంఖ్యలోకూడ అధికులు. పాపులను వారి పాపముల గురించి. అడుగ వలసిన దేమియు ఉండదు.

4. తర్వాత అతడు ఒకసారి తనవారి సమక్షముకు గొప్ప వైభవముతో వచ్చెను. అపుడు అచ్చటగల ప్రపంచ జీవితమును కాంక్షించు వారు అయ్యో ! మాకు ఖారూన్‌కు లభించినట్లు లభించిన భాగ్యం లేదే. నిస్సందేహముగా ఖారూన్ గొప్ప అదృష్టవంతుడని అనిరి.

5. అయితే వారిలో దూరదృష్టి గలవారు ఇట్లనిరి. "మీకు తిరస్కారము. ఈశ్వరుడిచ్చు ప్రతిఫలము, శ్రద్ధగలవారికిని, సత్కృత్యములు చేయువారికిని, హితకర మగును. మరియు అది ఓర్పుగల వారికే లభించుతుంది."

6. అటు తర్వాత మేము అతనిని, అతని యింటిని భూమిలో పూడ్చి వేసితిమి. అయినను ఈశ్వరునికి వ్యతిరేకముగా అతనికి సహాయ పడుటకు యే సమూహము లేదు. మరియు అతడు స్వయముగా ప్రతీకారము [illegible]

7. మరి నిన్నటి సాయంకాలమందు ఎవరైతే ఖారూన్ వలె నుండుటకు ఆశపడుచుండిరో వారు. ఇట్లనిరి. "అరే! ఈశ్వరుడు తనఅభీష్టులగు వారికి అధికముగు సంపద నిచ్చు చున్నాడు. మరియు తాను తల చిన వారికి పరిమితము చేయుచున్నాడు. ఈశ్వరుని ఉపకారము లేక పోయినచో మేముగూడ భూమిలో పూడ్చబడు వారమే కదా! అయ్యో! అయ్యో! శ్రద్ధహీనులు ఎన్నిటికి సఫలులు కాజాలరు"
28-16-62.

## 267. అతనికి ఇపుడు మిత్రులు లేరు.

1 అతనికి భగవన్ మహామహిమునిపై శ్రద్ధ లేకుండెను.

2. మరియు అతడు వంచితులకు అన్నమిడుటని యెవరిని ప్రోత్స హించలేదు.

3 కాబట్టి ఈ దినమందు అతనికి ఇచ్చట ఎవరునూ మిత్రులు లేరు.
69-33-35.

## 268. ఈశ్వరుడే సన్మానించెను మరియు మానహీనుని చేసెను.

1. చూడుడు! మానవునికి సుఖ, సన్మానము లిచ్చినపుడు, అతడు "నా ప్రభువు నన్ను సన్మానించెనని" చెప్పుచున్నాడు.

2. మరియు అతని జీవన వృత్తిని పరిమిత పరచి, పరీక్షించి నపుడు నా ప్రభువు నన్ను మానహీనుని చేసెనను చున్నాడు.

3. కాని కదాపి అట్లు కాదు. మీరు అనాథల వైపు ధ్యాన్నమివ్వ కుందురు.

4. దీనుల కన్నమిడుటలో ఒకరినొకరు ప్రోత్సహించు కొనకుందురు.

5 మరియు ఇతరుల వారసత్వపు సొమ్మును లాగి లాగి తినివేసి యుందురు.

6. ఇంకను ధనమును ప్రాణముకన్న మిన్నగా ప్రేమించి యుందురు.
89-15-20

## 269. లోభమూలకమగు స్పర్ధ

1. సమృద్ధి వల్ల కల్గిన తృష్ణ మిమ్ము భ్రమింపజేసినది.

2. మీరు స్మశానమునకు వెళ్ళువరకు అదే భ్రమలో నుంటిరి.

3. చూడుడు: కాదనకుడు. శీఘ్రంగా మీరు తెలుసుకో గల్గుతారు.

4. ఆలస్యము లేకుండా మీ గుర్తుకు రాగలదు.

5 అయ్యో: అయ్యో! మీకు నిశ్చయముగా జ్ఞానము కలుగుతుంది.

6. నరకాగ్నిని చూచుట తప్పనిసరి యని (అనుకుంటారు).

7. మరియు నిశ్చిత దృష్టితో మీరు దానిని చూడగలరు.

8. ఆదినమందు అవశ్యము ఈశ్వరీయ వరదానముల గురించి మీరు కృతజ్ఞత తెలిపితిరా యని అడుగ బడును. 102-1-8

# 56. దానము

## 270. దాన ప్రకరణము

1. భగవన్మార్గములో తమ ధనమును వెచ్చించు వారిని ఒక ధాన్యపు గింజతో పోల్చవచ్చును. ఒకగింజ నుండి ఏడు వెన్నులు వచ్చును. ప్రతి వెన్నుకు నూరు గింజలు. ఈశ్వరుడు తనకిష్టమగు వారిని ఈ విధముగా సమృద్ధిపరచును. అతడు సత్య ప్రాపకుడు, సర్వజ్ఞుడు.

2. భగవన్మార్గమున తమ ధనమును వ్యయపరచినవారు అట్లు వ్యయ పరచి ఉపకారము చేసితి మనరు. మరియు వారెవరికిని బాధ కలిగించరు. అట్టివారలకు తగిన ప్రతిఫలము ఈశ్వరుని చెంత గలదు వారికి భయము లేదు. మరియు దుఃఖితులు కారు.

3. పీడనతో కూడిన దానము కంటే ఒక మంచిమాట, మరియు క్షమించుట మంచిది ఈశ్వరుడు నిరపేక్షుడు మరియు అత్యంత సహిష్ణుడు.

4. ఓ శ్రద్ధావంతులారా ! ఉపకారము చేసితిమని చెప్పుకొని గాని, పీడన కలిగించిగాని మీదానమును నష్టపరచు కొనకుడు. పైకి కన బడు నట్లు భగవన్మార్గములో తమ ధనమును వ్యయపరుస్తూ మరియు అంతిమ దినముపై విశ్వాసము లేని వాడగుచో ఒక రాతి దిబ్బతో అతనిని పోల్చవచ్చును. ఆ దిబ్బ మీద కొంత మట్టి పడి యుండెను. పెద్ద వర్షము కురియుటచే ఆ దిబ్బ విచ్చుకపోయెను. ఇట్టి వారికి తమ ఆర్జితములో ఏమియు చేతికిరాదు. మరియు ఈశ్వరుడు శ్రద్ధాహీనులకు మార్గము చూపెట్టడు.

5. ఈశ్వర ప్రసన్నతకు దృఢచిత్తముతో భగవన్మార్గమున ఎవరు తమ ధనమును వ్యయపరచెదరో వారిని మిట్టనగల ఒక తోటతో పోల్చవచ్చును. ఆ తోటమీద వర్షము కురిసినచో వర్షముచే, ఇమ్మడి ఫలముల నిచ్చును. కొద్ది చినుకులు పడినను ఉపకరించును. ఈశ్వరుడు మీరుచేయు పనులన్నియు చూచు చున్నాడు.

6. ఉదాహరణకు ఒక ఖర్జూర లేక ద్రాక్షతోట ఉన్నదనుకొనుడు. ఆ తోట యందు నదులు ప్రవహించు చున్నవి, ఆ తోటలో వివిధములగు ఫలములు గలవు. తోట యజమాని వృద్ధుడయ్యెను.

అతని సంపాదము మిక్కిలి బలహీనమైనది ఇట్టి స్థితిలో అగ్నితో కూడిన సుడిగాలిచే ఆ తోట దగ్ధమయ్యెను. ఏమీ? ఈ విధముగా జరుగుట మీలో ఎవరికైనను ఇష్టమగునా? ఈశ్వరుడు ఇట్లు తన వాక్యకలాపములను మీరు ఆలోచించుటకు దృష్టాంతములుగా చూపుచున్నాడు. 2-261-260

## 271. ఉత్తమ వస్తువుల దానము.

1. ఓ విశ్వాసులారా! మీరు సంపాదించిన దానినుండిలేక మీకొరకు మేము భూమినుండి ఉత్పత్తి ద్వారా ప్రసాదించిన దానినుండి ఉత్తమోత్తమ వస్తువునే భగవన్మార్గములో వ్యయపరచుడు. మీరు స్వయముగా తీసుకొనుటకు ఇష్టపడని వస్తువులను దానము చేయకుడు. భగవన్మార్గములో పనికిరాని వస్తువులను దానము చేయుటకు తలపెట్టకుడు. ఈశ్వరుడు నిరపేక్షుడు మరియు స్తుతి పాత్రుడని గుర్తెరుగుడు. 2-267.

## 272. గుప్తదానము

1. మీరు ప్రకటితముగా దానముచేసినా మంచిది. కాని బీద, సాదలకు గుప్తముగా దానముచేయుట మరీ మంచిది. అందువల్ల మీలో గల చెడుగులు దూరమగును. ఈశ్వరునికి మీరు చేయు పనులన్నియు బాగుగా తెలిసియున్నవి. 2-271

## 273. అయాచిత దానము

1. కొందరు బీదలు ఈశ్వరుని కార్యములో నిమగ్నులై యుండుటచే భూమిమీద తిరుగులాడలేరు. ఇట్టి పేదభక్తులు దానమునకు అర్హులు. వారిని, వారి నడకను [illegible] భావింతురు. కాని

మీరు అట్టివారిని కనుగొన వచ్చును. వారు ప్రజలం వెంట బడి యాచించరు. మీరు భగవన్మార్గములో ఏమి వ్యయము పరచు చున్నది ఈశ్వరునికి తెలియును.

2. ఎవరు రాత్రిం బవళ్లు గుప్తముగాను, వ్యక్తముగాను భగవన్మార్గ ములో తమ ధనమును వ్యయపరచుదురో వారికి లభ్యమగు ప్రతి ఫలము ఈశ్వరుని చెంత గలదు. వారికి భయములేదు. మరియు వారు దుఃఖితులు గారు. 2-273-274.

## 274. అత్యంత ప్రియమగు వస్తువే ఈశ్వరునకు

1. నీకు ప్రియమగు వస్తువును ఈశ్వరుని మార్గములో ఖర్చు చేయు నంత వరకూ నీవు శుభమును పొందలేవు. నీవు ఈశ్వరునికై దానము చేయు వస్తువును అతడెరుగును. 3_92

## 275. ప్రాక్తరీ, రవిమోక్షణాత్

1. ఓ శ్రద్ధావంతులారా! మీ సంపద, సంతతి మిమ్ములను ఈశ్వరుని పట్ల అశ్రద్ధ గలవారిగా చేయకుండు గాక! అట్లు చేయువారు నష్టపడుదురు.

2. నేను మీకు ప్రసాదించిన దానిని భగవన్మార్గములో ఖర్చు చేయుడు. అంతకు పూర్వమే మృత్యువు ఆసన్నమైనచో ఓ ప్రభూ! మాకు మరికొంత గడువు ఎందుకివ్వవు? నీ మార్గములో దానము చేసి మంచివారిలో చేరుదుమని వారందురు.

3. కాని మృత్యువు ఆసన్నమైన ఏ ప్రాణికి ఈశ్వరుడు గడు వొసంగడు. మీరు చేయు పనులన్నియు అతడెరుగును.

63-9-11

# 23. నీతి బోధ

## 57. శివ శక్తి

### 276. శుభాశుభ వివేకము

1. చెప్పు :— శుభా శుభములు సమానములు కావు. పవిత్రత యొక్క విపులత మిమ్ములను ఎంతటి ఆశ్చర్యపరులను చేసినను సరే ; ఓ బుద్ధిమంతులారా ; మీరు సఫలురగుటకు ఈశ్వరుని వెంబడి యుండుడు. 5-108

## 58. నీతి నిర్దేశములు

### 277. నీతి సూత్రములు

1. నిస్సందేహముగా న్యాయము చేయుటకు, శుభము చేకూర్చుటకు, బంధుకోటికి సహాయపడుటకు ఈశ్వరుడే ఆదేశించెను. అతడు అనుచితములగు, సిగ్గుమాలిన కార్యములను మరియు అత్యాచారములను నిషేధించుచున్నాడు. ఇంతను ఈశ్వరుడు మీరు సావధానులగుటకు తగినట్లు బోధ చేయుచున్నాడు. 16-90

### 278. నైతిక ఉపదేశములు

1-1. ప్రభువు తనను తప్ప ఇతరులను ఆరాధించరాదని నిర్ణయము చేసెను.

1-2. మాతా పితరుల [illegible] మరి వారిలో ఒకరో [illegible] వృద్ధులగుచో

వారిని తూలనాడకుము, గద్దరించకుము సన్రుతతో మాటలాడు
మని (చెప్పెను).

2. మరియు వారి సమక్షమున సమ్రతా, కరుణలతో విధేయుడవై,
ఇట్లు అనుచుండుము. "ఓ ప్రభూ ! నన్ను వారు (నాతల్లిదండ్రులు)
బాల్యము నందు పోషించినట్లే నీవు వీరిద్దరి మీద కృప చూపుము."

3. మీ మనసులో ఏమిగలదో ! మీ ప్రభువుకు చక్కగా తెలియును.
మీరు మంచివారలగుచో, భక్తివైపు మళ్ళు వారిని అతడు క్షమించు
వాడై యున్నాడు.

4. (3) సన్నిహిత బంధువులకును, దీనులకును, మార్గస్థులకును అర్హ
మైనది ఇచ్చివేయుము. (4) మరియు దుర్వ్యయము చేయకుము.

5. నిస్సందేహంగా దుర్వ్యయము చేయువారు సైతానుకు సోదరులు
మరియు సైతాన్ తన ప్రభువుపట్ల పరమ కృతఘ్నుడు.

6. (5) నీవు ఆశించిన ప్రభు కృపాన్వేషణలో వారికి (మాతా పితరు
లకు) దూరుడవైనను, వారితో నమ్రతతో మాటలాడుము.

7. (6) నీవు లోభివై చేయి ముడుచుకొనకుము. ఇదే విధముగా
అధిక వ్యయము చేయకుము. దానివల్ల నిందితుడవు, కంగాల్
వాడవై కూలబడి పోయెదవు.

8. నిస్సందేహంగా నీ ప్రభువు తనకభీష్టులకు హెచ్చు జీవికను ఇచ్చు
చున్నాడు. మరియు తాను తలచిన వారికి దానిని పరిమిత పరచు
చున్నాడు. నిస్సందేహంగా ఈశ్వరుడు తన దాసులగు వారి నుంచి
అవగతుడు మరియు సర్వదృక్కు.

9. (7) మరియు మీరు దరిద్రతా భయముచే మీ సంతానమును చంపకుడు. మేమువారికి మరియు మీకును (తగిన) జీవన భృతి నిచ్చెదము. సంతానమును చంపడము మహాపాతకము.

10. (8) మరియు వ్యభిచారము దాపునకు పోవకుడు. అది నిస్సందేహంగా లజ్జాహీనము, మరియు చెడు మార్గమై యున్నది

11. (9) న్యాయముంటేనే తప్ప, నిషేధించిన ప్రాణులను వధించకుము. అన్యాయముగా చ పబడిన వారి వారసునకు, మళ్ళీచంపు అధికారము గలదు. కాని అతడు మితి మీరరాదు. నిస్సందేహముగా అట్టివారికి సహాయము చేయబడును.

12. (10) సదుద్దేశ్యముతోనే తప్ప అనాధల ధనముచెంతకు, వారు వయోజనులగు వరకు వెళ్ళకుము. (11) మరియు చేసిన వాగ్దానమును పూర్తిచేయుము. నిస్సందేహముగా వాగ్దానముల గురించి అడుగ బడును.

13. (12) కొలచి ఇచ్చినప్పుడు నిండుగా నిమ్ము సరియగు తూకముతో తూచుము. ఇది శ్రేష్టము. దాని పరిణామమూ శ్రేష్టమే.

14. (13) నీకు తెలియని విషయము వెంటపడకుము. తప్పనిసరిగా చెవి, కన్ను, మనస్సు, వాటి నన్నిటిని ఆదినమున ప్రశ్నించబడును.

15. (14) భూమి మీద ఖిడిసిపడి నడువకుము. నీవు భూమిని చీల్చలేవు. మరియు పర్వతము అంత ఎత్తునకు నీవు పోజాలలేవు.

16. ఈ ఆదేశములలో గల ప్రతి ఒక చెడు స్వరూపము నీ ప్రభువు కెంత తిరస్కరించ దగినది.

17. ఈ ఉపదేశ వాక్యములు ప్రభువుచే అందించబడిన ప్రజ్ఞానము గలవు 17-23-

## 279. లుక్మాన్ తన పుత్రునకు చేసిన బోధ.

1. మేము ఈశ్వరునికి కృతజ్ఞతను వెల్లడించు (విద్య) నేర్పును లుమాన్‌కు ప్రసాదించితిమి కృతజ్ఞత వెల్లడించుట తన మేలు కొరకే. కృతఘ్నుడగుచో ఈశ్వరుడు నిరపేక్షుడు మరియు అతడే స్తుతి పాత్రుడు.

2. కుమారా! ఈశ్వరునితో ఎవరిని భాగస్థులుగా నిర్ధారణ చేయకుము. నిస్సందేహముగా భక్తిహీనత గొప్ప అత్యాచారము.

3. మేము మానవునికి అతని తల్లిదండ్రుల గురించి ఆదేశము లిచ్చితిమి. అతనిని తన తల్లి అలయుచు, సొలయుచు గర్భములో వుంచినది. మరియు రెండు సంవత్సరములలో ఆమె నుంచి చను పాలు మానుతాడు. కాబట్టి నీవు నాకు, మరియు నీ తల్లితండ్రులకు కృతజ్ఞత వెల్లడించుము. నావైపే నీవు తిరిగి రావలసి యున్నది.

4. నీకు తెలియని వస్తువును నాతో సమానముగా అంగీకరించుమని ఒత్తిడి తెచ్చినచో వారిరువురి (తల్లిదండ్రుల) మాటలను వినకుము సౌజన్యముతో ప్రపంచమున వారివెంటనంటి వుండుము. మరియు నన్నుశరణు జొచ్చినవారి మార్గమునే అనుసరించుము. నా వైపే నీవు తిరిగి రావలసియున్నది. అపుడు నేను నీవు చేసినదంతయు చూపించ గలను.

. కుమారా! ఆవగింజతో సమానమైన వస్తువైనను, అది రాతిలో నున్నను, భూమ్యాకాశములలో నున్నను ఈశ్వరుడు నిశ్చయ

ముగా తన సమక్షమునకు రప్పించగలడు. నిస్సందేహంగా ఈశ్వరుడు గొప్ప సూక్ష్మదర్శి, సర్వస్పర్శి.

3. కుమారా! నిత్యనియమిత ప్రార్థన చేయుము. ప్రజలకు మంచిని గురించి మార్గ దర్శకుడవు కమ్ము. చెడును నిరోధించుము. నీపై బడిన భారమును సహించుము. నిస్సందేహంగా దీనిచే ఓర్పు యుందురు.

7. ప్రజలను అవమానమునకు గురిచేయుచు. పొంగిపోకుము. భూమి మీద మిడిసిపడి నడువకుము. నిస్సందేహంగా ఈశ్వరుడు శ్రద్ధా హీనుడగు ఆత్మశ్లాఘిని మెచ్చుకొనడు.

8. జీవన సరళిలో మధ్యమార్గము ననుసరించుము. నీ ధ్వనిని మృదువు పరచు కొనుము. నిస్సందేహముగా ధ్వనిలో గాడిద ధ్వని అన్నిటి కన్న చెడ్డది. 31-12-18

## 280. ఉత్తమ గృహస్థుడు

. మేము మానవులకు తమ తల్లిదండ్రుల యెడ సద్వర్తనతో మెల గుమని ఆజ్ఞ ఇచ్చితిమి. తల్లి అతనిని శ్రమపడి మోసినది. కష్ట పడి జన్మనిచ్చినది. అతని గర్భనివాసము, పాలు ఇవ్వడము 30 నెలలలో పూర్తియగుచున్నది, అతడు యువకుడై నలుబది సంవ త్సరములు రాగా ఇట్లు అనగలడు. "ఓ ప్రభూ! నాకును నాతల్లి దండ్రులకునూ ప్రసాదించిన వరదానములకు కృతజ్ఞుడనై యుండు నట్లు అనుగ్రహించుము. మరియు నీవు నాకు ప్రసన్నుడ వగు టకు సత్కార్యములు చేయు ప్రేరణనిమ్ము నా కొరకు సంతాన మును సంస్కరించుము. నేను శరణాగతుడను" నీ వైపు తిరిగి వచ్చితిని."

2. ఇట్టివారు చేయు సత్కార్యములను నేను స్వీకరించు చున్నాను. మరియు వారు చేసిన దోషములను క్షమించు చున్నాను. వీరతే స్వర్గమున కరుగువారు. వారితో చేయబడిన వాగ్దానములు సత్యమైనవి. 46-15-16.

—:o:—

# 2౬. శిష్టాచారము

## ౫9. సదాచారము

### 281. మద్య నిషేధము

1. ప్రజలు సారాయి, జూదము గురించి నిన్ను ప్రశ్నించెదరు. చెప్పు:- ఈ రెండు మహాపాపములు. వాని వలన బహుకొద్ది లాభము న్ననూ, నష్టము అత్యధికముగా నున్నది. 2-21౯.

### 282. ప్రత్యుత్తరములో అత్యధికమగు విధేయత చూపుము

1. మీకు ఆదర పూర్వకముగా ప్రణామము చేసినపుడు, అంతకు మించిన ఉత్తమ పద్ధతిలో ప్రత్యుత్తర మిమ్ము. లేక అవే మాట లనుము. ఈశ్వరుడు నిస్సందేహాంగా ప్రతివస్తువు లెక్క గైకొను వాడు. 4-86.

### 283. ఇతరుల గృహముల కెళ్ళునపుడు.

1. ఓ శ్రద్ధావంతులారా! అన్యుల గృహముల లోనికి అనుమతి దొరక నంత వరకు, మరియు ఇంటివారలకు నమస్కరించనిది ప్రవేశించ కుడు. ఇది మీకు మంచిని చేయును. దీనిని జ్ఞప్తి యందుంచు కొనుడు.

2. నీవు పోవుచున్న గృహములో ఏవరూ లేని యెడల అనుమతి లభించు వరకు వెళ్ళకుము. నిరాకరించినచో వెంటనే తిరిగిరమ్ము. ఇది పవిత్రతకు దారితీయును. నీవుచేయు కార్యము లన్నియు ఈశ్వరునకు తెలియును. 24-27-28.

## 284. సభా వ్యవస్థ

1. ఓ శ్రద్ధావంతులారా! సభా సమావేశములలో స్థలము చేయుడని మిమ్ము కోరినచో, మీరు స్థలమును విశాలపరచి చూపుడు. అందు వల్ల ఈశ్వరుడు మీకు వైశాల్యతను కల్పించగలడు. నిలుచుండుటకు మిమ్ము కోరినచో నిలబడుడు. ఇట్లు చేయువారు శ్రద్ధావంతులగుచో వారికి ఈశ్వరుని వద్ద విశాలమగు క్షేత్రము, ఉన్నత స్థానములభించును మీరుచేయునదంతయు ఈశ్వరునకు తెలియును.

## 285. సిఫారసులో బాధ్యత

1. మంచి కొరకు సిఫారసు చేసినచో, చేసిన వారికి ఆ మంచిలో భాగము లభించును. ఇటులనే చెడు సిఫారసు చేసినవాడు చెడుగుకు బాధ్యుడగును. ఈశ్వరునిదృష్టి అంతటను గలదు

## 286. ఆలోచనలు

1. ఓ శ్రద్ధావంతులారా! పాపములకు, అత్యాచారములకు మరియు దూత అవజ్ఞతకు రహస్యముగా ఆలోచనలు చేయకుడు. సత్కార్యములకు, ధర్మ పరాయణతకు ఆలోచనలు జరుపుడు. మరియు ఈశ్వరునకు భయపడుడు. అతని సన్నిధికే మీరుచేర్చబడుదురు.
2. ఏమీ? ఆకాశములలో, భూమిలోగల సర్వమును ఈశ్వరుడెరుంగుటను నీవు గమనించుట లేదా? ముగ్గురితో కూడిన రహస్య సభలో ఈశ్వరుడు నాల్గవ వాడుగా నున్నాడు. ఇటులనే ఐదుగురి రహస్యాలోచనలో ఆరవవాడు ఈశ్వరుడు. వారెచ్చట నున్నను, ఎక్కువ తక్కువగా నున్నను, అతడు వారివెంటనే ఉంటున్నాడు. మరియు అతడు పునరుద్ధానదినమందు వారు చేసిన పనులన్నిటి వృత్తాంతమును వినుపించు చున్నాడు. నిస్సందేహంగా ఈశ్వరుడు ప్రతి వస్తువును తెలిసిన వాడు. 58-9-7

# సప్తమ ఖండము

# 25. మానవత్వము

## 60. మానవుని ప్రత్యేకతలు

### 287. మానవుని ప్రత్యేక యోగ్యత - వాణి

1. నీ ప్రభువు దేవదూతలతో, నేను ఒక ప్రతినిధిని భూమి మీద సృజింపబోవుచున్నానని చెప్పినపుడు ఏమీ ! భూమి మీద కలహములు రేకెత్తించే వానిని, రక్తపాతము చేయునటువంటి వారిని మీరు నియమించు చున్నారా ? మేమైతే మీ స్తుతితో పాటు జపము, జయగానము చేయుచూ మీ పవిత్రతను కీర్తించువారమనిరి. అపుడు నిస్సందేహముగా మీరు ఎరుగనిది నేనెరుగుదునని (ఈశ్వరుడు) చెప్పెను.

2. మరియు ఈశ్వరుడు ఆదామునకు అన్ని వస్తువుల నామములు నేర్పి ఆ వస్తువులను దేవదూతల ముందు ఉంచి మీరు సత్యవంతులగుచో వాని పేర్లు తెలుపు డనెను.

3. వారు (దేవదూతలు) అపుడు ఇట్లనిరి :- "నీవు పవిత్రుడవు. నీవు నేర్పిన దానికన్న మేమేమి అధిక మెరుగము. నిస్సందేహముగా నీవే సర్వజ్ఞుడవు, సర్వవిదుడవు."

4. ఓ ఆదామా ! దేవదూతలకు ఆ వస్తువుల నామములు తెలుపుమని (ఈశ్వరుడు) చెప్పగా, ఆదాము వారికి ఆ వస్తువుల పేర్లు తెలియ

జేసెను. అపుడు ఈశ్వరుడు "ఏమీ! ఆకాశములలో, భూమిలోని గుప్త స్థితిగతులను నేను ఎరుగుదు నని చెప్పలేదా? మీరు ప్రకటించునది ఎరుగుదును. మరియు మీరు దాచునవి గూడ ఎరిగిన వాడ"నని చెప్పెను.

5. తదనంతరము మేము దేవదూతలను ఆదామునకు ప్రణమిల్లు డని చెప్పగా సైతాన్ తప్ప అందరూ ప్రణయులు చేసిరి. సైతాన్ నిరాకరించెను. తాను గొప్పవాడనను గర్వములో పడి శ్రద్ధాహీను లలో చేరి పోయెను. 2-30-34

## 288. మానవుడు: ఈశ్వరుని ఉభయ హస్త రచన

1. ఈశ్వరుడు సైతాన్‌తో ఇట్లు చెప్పెను—ఓ ఇబ్లీసూ! నా ఉభయ హస్తములచే సృజించిన వస్తువుకు ప్రణతి చేయుటలో నిన్ను ఏ వస్తువు నిషేధించుచున్నది? ఏమీ! నీవు బడాయిచే గొప్పవాడ నను గర్వమునందు పడిపోయితివా? లేక నీవు ఉచ్చశ్రేణికి చెందిన వాడనను కొంటివా? 38-75

## 289. మూడు ప్రత్యేక వరదానములు. గ్రంథము, త్రాసు, లోహము.

1. మేము మా దూతలను, ప్రత్యక్ష చిహ్నముల నిచ్చి పంపితిమి. వారి వెంట గ్రంథముండెను. మరియు న్యాయముపై ప్రజలు స్థిరులై యుండుటకు త్రాసు పంపబడెను. మరి లోహము నిచ్చితిమి. దానిలో గొప్ప సంకట మున్నది. మరియు ప్రజలకు లాభము లనేకములు గలవు. 57-25

## 290. రక్షిత నిధి

1. మేము ఈ రక్షిత నిధిని ఆకాశములు, భూమి, పర్వతముల ముందుంచితిమి. కాని వారంపరు ఆ నిధిని నిర్వహించుటకు అంగీకరించరైరి. భయపడిరి. మానవుడు దానిని నిర్వహించుటకు సంసిద్ధుడయ్యెను. నిశ్చయముగా అతడు పెద్ద నిరంకుశుడు మరియు అజ్ఞాని. 33-72

## 291. రెండు కోణములు

1. వాస్తవముగా మేము మానవుని ఉత్తమునిగా సృష్టించితిమి.
2. తిరిగి మేము అతనిని నీచాతి నీచునిగా చేసి దొర్ల గొట్టితిమి.

95-4-5

## 292. మూడు తరగతులు

'హీనులు, మధ్యములు, ఉత్తములు'

1. .........అయితే వారిలో కొందరు తమ ప్రాణములమీదనే అత్యాచారము చేయువారై యున్నారు కొందరు మధ్య తరగతిలో నున్నవారై యున్నారు. వారిలో మరికొందరు ఈశ్వరునికి సంబంధించిన మంచి కార్యములలో అందరికన్న పురోగమించు వారై యున్నారు. ఇదే గొప్ప భాగ్యము. 35-32

## 293. మనుష్య జన్మము యొక్క హేతువు

1. కేవలము నన్ను భజించుటకు (నాకు భక్తి చేయుటకు) నేను జిన్నులను మరియు మానవులను సృజించితిని.
2. నేను వారిని తినుటకు తిండిని కోరుట లేదు.

3. నిస్సందేహంగా ఈశ్వరుడే అందరకు జీవిక నిప్వగల వాడు, బలశాలి శక్తిమంతుడును. 51_56_58

# 61. మానవుని దౌర్బల్యములు

## 294. అస్థిరులు

1. లాభము అందుబాటులో నుండి ప్రవాసము సులభముగా నున్నచో ఆ మనుష్యులు తప్పక నీవెంట బడుచుందురు. కాని ఈ ప్రవాసము వారికి మిక్కిలి కఠినముగా నున్నది...... 9_42

## 295. అనుభవమైనను, గుణపాఠమగుట లేదు.

1. ఏమీ ! వారు భూమి మీద పర్యటించుచూ చూడలేదా ? వారికన్న పూర్వముగల వారి గతి ఏమైనది ? వారు వీరికంటె శక్తిలో గొప్పవారు. ఆ లోకులు భూమిని దున్నిరి, సాగుచేసిరి, నాటిరి. వీరు, భూమిని ఎంతటి సంపన్నము చేసిరో, అంతకు హెచ్చుగానే వారును సంపన్నము గావించిరి. వారి దగ్గరకు భగవద్దూతలు స్పష్టమగు చిహ్నములు తీసుకొని వచ్చిరి. ఈశ్వరుడు వారిమీద ఎట్టి అన్యాయము చేయలేదు. కాని వారు, తమపై తామే అత్యాచారములు చేసుకొనుచుండిరి. 30_9

## 296. డోలాయమాన చిత్తులు

1. మానవునకు నా కృపారసము చవిచూపించిన పిదప దాని నుండి అతనిని తొలగించినచో, అతడు నిరాశుడై, కృతఘ్నుడగు చుండును.

2. ఇదే మాదిరి ఆపద వచ్చినప్పుడు నా కృపారసము యొక్క రుచి అతనికి చూపించినచో (అది తెలుసుకొనక) అతడు తన వలనన

తన కష్టములు, దుఃఖము లన్నియు దూరమైనవని అనుచుండును. నిస్సందేహముగా మానవుడు పెద్ద గర్విష్ఠుడు మరియు ఆత్మ శ్లాఘు చేసికొనూడు. 11-9-10

## 297. దురాశాపరుడు

1. మేము అతనికి ధనము నధికముగా నిచ్చితిమి.

2. వెంట నుండు పుత్రులను

3. అతనికి అన్ని విధములగు సాధన సంపత్తిని సమకూర్చితిమి.

4. అయినను, ఇంకను అధికముగా ఇవ్వవలె ననుదురాశ అతనికి గలదు. 7-12-15

## 298. దుఃఖితుడు మరియు దీర్ఘసూత్రుడు

1. నిస్సందేహముగా మానవుడు తొందరపాటు గలవాడుగా ( ఓర్పు లేనివాడుగా ) సృజింపబడెను.

2. కష్టము కల్గినపుడు అతడు భ్రాంతు డగు చున్నాడు.

3. సంపద లభ్యమైనపుడు ఇచ్చుటలో ప్రలోభపడు చున్నాడు. 70-19-21

## 299. సంవేదనా హీనులు

1. ఏమీ ః ప్రతి సంవత్సరము ఒకసారి లేక రెండుసార్లు వారు పరీక్షకు గురి చేయబడు చున్నప్పటికి, పశ్చాత్తాపపడుట లేదు గుణపాఠమూ తూడ గైకొనుటలేదు. 9-126

### 300. చెడువైపు వెళ్ళుటకు త్వరపడు వాడు

1. ఓ ప్రజలారా! మంచి కంటె ముందు చెడు, కొరకు ఎందుకు (మీరు) తొందర పడెదరు? మీపై కృప చూపుటకు ఈశ్వరుని క్షమాపణ ఎందుకు కోరరు? 27-46

## 62. పాపాభిముఖత

### 301. జీవుని దోష ప్రవృత్తి

1. నన్ను నేను (హజరత్ యూసుఫ్) దోష ముక్తుడనని అంగీకరించను. నిస్సందేహముగా మానవుని మనస్సు నా ప్రభువు కృప ఉంటేనే తప్ప చెడు వైపుకే పోవుచున్నది నిస్సందేహంగా ఈశ్వరుడు క్షమాశీలుడు. 12-53

### 302.

1. ఒక వేళ ఈశ్వరుడే ప్రజలను వారు చేసిన పనులకు బంధింప దలచినచో, ఈ విశ్వములోగల ఏ ప్రాణియు వదలబడి యుండదు. 35-45

### 303. శుభము ఈశ్వరునిది - అశుభము మనది

1. నీకు కలుగు మేలు ఈశ్వరుని వైపు నుంచియు, నీకు కలుగు కీడు నీ వాసనల నుంచియునని తెలియుము. 4-79

## 63. కృతఘ్నత

### 304. ఓ మానవుడా నీవు కృతఘ్నుడ వెందుకైతివి?

1. ఓ మనుజుడా! నిన్ను ఏ వస్తువు, మహోదారుడగు నీ ప్రభువు నుంచి బెదరగొట్టినది?

2. అతడు నిన్ను సృజించెను, తర్వాత సంస్కరించెను. దానితో పాటు సమత్వ యుక్తునిగా చేసెను.

3. మరియు నిన్ను ఏ రూపములో ఉంచదలచెనో ఆ రూపముకు తగిన యోగ్యతను కలుగజేసెను. 82-6-8

## 305. కృతఘ్నుడు అగు మనుష్యుడు

1. నిశ్చయముగా మనుష్యుడు తన ప్రభువుకు గొప్ప కృతఘ్నుడు.

2. మరియు నిస్సందేహముగా (ఆ కృతఘ్నతకు) అతడు సాక్షిగా నున్నాడు.

3. అతడు ధనమును ప్రేమించుటలో గొప్ప ఘటికుడు.

4. ఏమీ! అతనికి సమాధిలోగల వస్తువును వెలుపలికి తీయు సమయము తెలియదా?

5. వక్షస్థలములలో గలదంతయు గ్రైకొనబడగలదు.

6. నిస్సందేహముగా వారి ప్రభువు ఆ దినమందు వారి స్థితిగతుల నుంచి సంపూర్ణంగా అవగతుడై యున్నాడు. 100-6-11

## 306. దుఃఖములో స్మరణ, మరియు సుఖములో విస్మరణ

1. మానవుడు కష్టదశలో నున్నపుడు పరుండగా, లేవగా, (నిలచుండగా) కూర్చుండగా, ప్రతిసమయమున నన్ను స్మరించుచుండును. మరి నేను ఆకష్టస్థితిని తొలగించగనే ఇంతకు పూర్వము కష్టములో నన్ను పిలువలేదన్నట్లు నటించు చుండును. ఇట్లు మర్యాద నతిక్రమించు వారికొరకు, వారి కార్యకలాపములు, వారికి రమణీయములుగా నుండు నట్లు కనబడ జేసితిని. 10-12

## 307. సాగర తీరముల దృష్టాంతము

1. ఆ ఈశ్వరుడే మిమ్ముల స్థల జలాచులలో త్రిప్పుచున్నాడు. నౌక లలో మీరు ప్రయాణము చేయుచున్నపుడు, ఆ నౌకలు వాయువు అనుకూలతచే నడుచు చుండును. అపుడు ప్రయాణీకులు సంతోషించెదరు. అకస్మాతుగా ఆ నౌకలమీద ఝంఝూమారుతము రాగా అలలు నలువైపుల పైబడి రాగలవు. ఆ సమయమున వారు సుడిలో పడిపోతిమని అనుకొందురు. మరియు ఈశ్వరునిపై నిష్ఠ నిలిపి విశుద్ధహృదయముతో మమ్ముల రక్షించితివా, మేము మీకు కృతజ్ఞులమని ప్రార్థించు చుందురు.

2. తర్వాత ఈశ్వరుడు వారిని రక్షించగానే శీఘ్రముగా వారు బయటకు వచ్చి భూమి మీద అన్యాయపరులై విద్రోహ మొనర్చెదరు. ప్రజలారా! మీ విద్రోహము మీకే విరోధమగును. ఐహిక జీవనము యొక్క అల్పకాలపు లాభమును విసర్జించుడు. తరువాత మీరు నా దగ్గరకే తిరిగి రావలసి యున్నది. అపుడు మీరు ఏమేమి చేసినది నేను మీకు (పట్టి, పట్టి) చూపగలను

## 308. మాయా మహిమ

1. మానవుడు సంపన్నత్వము కొరకు ప్రార్థనచేయుటలో అలసిపోడు కాని కష్టమురాగానే హతాశుడు, నిరాశుడు అగుచున్నాడు.

2. అతనికి కష్టము సంభవించి నపుడు నా కృపారసము యొక్క రుచిని చవి చూపినచో నా కొరకే, నా వల్లనే జరిగినదని వాగును.

3. మానవునికి సుఖసాధనలు సమకూర్చినపుడు నాకు విముఖుడై నన్ను తూలనాడుచు, కష్టము వచ్చినపుడు, దీర్ఘముగా ప్రార్థనలు చేయు వాడగుచున్నాడు. 41-49-50-51

# 64. ఆస్తికత, నాస్తికత

## 309. మంచి మీద విశ్వాసము గలవారును లేనివారును

1. వ్యాపించు చున్న రాత్రి ప్రమాణము.
2. ప్రకాశించు చున్న (పగలు) దినము ప్రమాణము.
3. స్త్రీ, పురుషులను సృజించిన వాని ప్రమాణము.
4. నిస్సందేహముగా మీ ప్రయత్నము అస్తా వ్యస్తమగును.
5. ఎవడు భగవన్మార్గములో దానముచేసి, సంయమము అలవరచు కొనునో,
6. మంచితనముపై విశ్వసించునో,
7. అట్టివానికి మేము సుఖ, సౌఖ్యములు కలిగించెదము.
8. ఎవరు లోభులై, నన్ను నిర్లక్ష్యము చేయుదురో,
9. మరియు మంచితనముపై విశ్వాసముంచరో
10. వారిని మేము సంకటములో పడవేయుదుము.
11. అచట వారు గోతిలో పడువారగుటచే వారి ధనము వారికి ఉపయోగ పడదు.
12. నిస్సందేహముగా మార్గ దర్శకము చేయుబాధ్యత మాదే.
13. నిస్సందేహముగా ఇహ పరలోకములు రెండూ మావే.
14. అందువల్ల మేముజ్వాలాయమానమగు ఒక అగ్నినుంచి, మిమ్మల జాగరూకుల జేయుచున్నాము.

15. అభాగ్యుడగు వాడు దానిలో పడిపోగలడు.

16 ఎవరు ఈశ్వరుని ధిక్కరించిరో, మరియు ఎవరు అతనికి విముఖులైరో (వారు పడిపోగలరు)

17. మిక్కిలి ధర్మపరాయణుడగు వాడే ఆ అగ్నినుంచి కాపాడ బడగలడు.

18. ఎవడు భగవన్మార్గములో తన ధనమును తాను పరిశుద్ధుడగుటకు ఇచ్చునో,

19. మరియు ఆ ఇచ్చుటలో ప్రత్యుపకారాపేక్ష ఏమాత్రము ఉండదో,

20. కేవలము తన పరమ ప్రభువు, ప్రసన్నతను కోరియే ఇచ్చునో,

21, నిశ్చయముగా అతడు కృతార్థుడు, ప్రసన్నుడు. 92-1-21



# అష్టమ ఖండము

# 23. పూర్వ ప్రేషితులు

## 65. దూతలు సర్వజన హితముకొరకు

### 10. దూతలు మాతృభాషలో చెప్పెదరు.

మేము ఎవరిని దూతలుగా పంపినను, అచ్చటి సమాజ భాషలో, మాటలాడు వారినే పంపితిమి. అందువల్ల వారు అచ్చటి వారికి చక్కగా బోధింపగల్గిరి. 14-4

### 311. ప్రతి ఒక సమాజమునకు దూత

ప్రతిసమాజమునకుదూతగలడు. అతడువచ్చినపుడు ఆసమాజములో న్యాయమగు నిర్ణయములు జరుగుచున్నవి. అన్యాయము జరుగుట లేదు. 10-47

## 66. దూతలు మానవులే

### 312. పూర్వపు ప్రేషితులు మానవులే

1. మేము నీకన్న పూర్వము మనుజులనే దూతలుగా పంపితిమి. వారికి మేము ప్రజ్ఞానము ప్రసాదించితిమి. మీకిది తెలియనిచో, గ్రంథవంతుల నడుగుడు.

2. మేమువారిశరీరములను భోజనముచేయనివానినిగా నిర్మించియుండ లేదు. వారు మరణము లేకుండా సదా ఉండువారు కారు.
21-7-8.

## 313. భార్యా పిల్లలతో కలిసియుండు వారు.

1. మేము మీ కన్న పూర్వము దూతలనేకుల పంపితిమి. మరియు వారిని భార్యా, పిల్లలతో ఉండు వారుగ నట్లు చేసితిమి. దూత లలో ఎవరికినీ ఈశ్వరాజ్ఞ లేనిది ప్రభువు చిహ్న మేమియు గైకొని రావడము సంభవముకాదు. ప్రతి ఒకరికి వారి గడువు వ్రాయబడి ఉన్నది. 13_38

## 314. దూతలందరికి సైతాను మొదలు అనుభవముకలదు.

1. మేము నీ కన్న పూర్వము గ్రంథపఠనముచేయు చున్నపుడు పఠ నములో సైతాను జోక్యము కలుగచేసుకొనని దూతలను, ప్రవక్త లను ఎవరిని పంపలేదు. ఈశ్వరుడు (అందువల్ల) సైతాను కల్పించే చిక్కు, చికాకును తొలగించు చున్నాడు. మరియు తన వచనములను ప్రతిష్ఠాపన మొనర్చు కొనుచున్నాడు. ఈశ్వరుడు సర్వజ్ఞుడు, సర్వవిదుడు. 22_52

## 315. మనుష్యులే దూతలుగా రావడ మెందుకు?

1. ప్రజల చెంతకు ధర్మోప దేశములు వచ్చినపు డెల్లను వానిపై శ్రద్ధ చూపరాదని ఎవరునూ అనలేదు. కాని ఈశ్వరుడు మనుష్యుని దూతగాచేసి పంపినాడా? అని చెప్పడము జరిగినది.

2. చెప్పు:— దేవదూతలు ప్రశాంతముగా భూమి మీద సంచరించుచు ఉంటే, వారిలో ఒకరిని ప్రవక్తగా చేసి ఆకాశము నుంచి పంపి యుండే వారము. 17-94-95

### 316. దూతలు మానవులే కాని ఈశ్వరుని కృపా పాత్రులు

1. ఏమి! మీకు ఈశ్వరుని గురించిసందేహము గలదా? అతడు భూమి ఆకాశముల సృష్టికర్త. మరియు మీ దోషములను క్షమించుటకు మిమ్ముల ఆహ్వానించు చున్నాడు. అవసరమగునో, (క్షమాపణకు) ఒక నిశ్చిత సమయము కొరకు గడువొసంగ గలడు.

"మీరైతే మా వంటి మానవులే కదా! మా తాత, తండ్రులు సేవించిన వారిని సేవించరాదనడం మీ ఉద్దేశ్యమై యున్నదే! అట్లగుచో ఏదైనా ప్రమాణము తెండుచూచెదమని" వారు చెప్పిరి.

2. అపుడు వారితో "మేము మీవంటి మానవులమే, కాని ఈశ్వరుడు తన భక్తులలో తనకు ప్రియులగు వారిపై ఉపకారము కనబరచు చున్నాడు. ఈశ్వరుని ఆజ్ఞలేనిదే ప్రమాణ పత్రము తేవడము మా అధికారమందు లేదు. శ్రద్ధావంతులకు ఈశ్వరుని మీదనే విశ్వాసముంచ వలెనని వారి దూతలు చెప్పిరి."

3. మరి "ఈశ్వరునిపై విశ్వాసము లేక పోవుటకు మాకు కారణమేమీ కనబడుట లేదు. అతడు మాకు మార్గమును చూపించెను. మేము మీరు పెట్టుబాధలను తప్పక సహించెదము. విశ్వసించువారలకు ఈశ్వరుని మీదనే విశ్వాసముంచ వలెను." అని దూత చెప్పిరి.

14-10-12

## 67. గుణ విశిష్టులు

### 317. దృఢ నిశ్చయులు

1. ప్రపత్తులనేకులు గలరు. వారితో ఈశ్వర నిష్ఠులనేకులు సహకరించి పోరాడి నపుడు ఈశ్వరీయ మార్గములో పడిన బాధలకు

వారు ధైర్యమును కోల్పోలేదు. లొంగుబాటును చూపలేదు. శక్తి హీనులు కాలేదు. ఈశ్వరుడు దృఢనిశ్చయులగు వారిని ప్రేమించుచుండును.

2. వారు పలికినవి ఈ క్రింది మాటలే. "ఓ ప్రభూ! మా పాపములను మరియు మేము చేయు పనులలో అత్యాచారములు జరిగినచో మమ్ము క్షమించుము. మాకు స్థిరత్వము నిమ్ము మరియు శ్రద్ధా హీనులకు ప్రతికూలముగా మాకు సహాయపడుము".

3. అందుచే వారికి ఈశ్వరుడు ఇహలోక ఫలమును, మరియు పారలౌకిక శ్రేష్ఠఫలమును ప్రదానముచేసెను. ఈశ్వరుడు సత్కార్యములు చేయు వారిని ప్రేమించు చున్నాడు. 3-146-148

## 318. సహన శీలురు

1. నీ కన్న పూర్వము దూతలనేకులు తిరస్కరించ బడిరి. తిరస్కృతులైనను, బాధలు పెట్టబడినను, వారు నా సహాయము అందు వరకు సహనము కలిగి యుండిరి. ఈశ్వరుని అభివచనములను మార్చు వారెవరునులేరు. నిస్సందేహముగా దూతల వృత్తాంతములు నీకు అందించ బడినవి.

2 ఒకవేళ వారి వైముఖ్యము నీకు దుఃఖకరమగుచో నీకు శక్తి యున్న, భూమిలో ఒక సొరంగమును వెదకుము. లేక ఆకాశమున మెట్లను అన్వేషించుము. పిదప వారి దగ్గరకు ఒక చిహ్నమును తీసుకొని రమ్ము. ఈశ్వరుడు తలచినచో వారినందరిని తప్పక భగవన్మార్గములో చేర్చు వాడు. కావున నీవు అవివేకివి కావలదు. 6-34-35

### 319. విపరీత పరిస్థితులలో బోధించు వారు

1. ఈశ్వరుడు నష్టము కలిగించు వారికిగాని కఠినముగా శిక్షింప దలచుకొన్న వారికిగాని మీరు ఏమి ఉపదేశము చేయగలరని వారిలోని ఒక వర్గము వారు అడిగిరి.

"మీ ప్రభువు ఎదుట మేము దోషముక్తుల మగుదుమని, మరియు బహుశః వారు రక్షింపబడుదురని, ఆ భక్తులు దానికి ఉత్తరమిచ్చిరి. 7-164

## 68. కథలు చెప్పుటకు గల కారణము

### 320. దూతల చరిత్రలు ఎందుకు చెప్పబడినవి ?

1. మేము నీ మనస్సును దృఢపరచుటకు, దూతల కథలను వినిపించుచున్నాము. ఆ కథలచే నీకు సత్యము బహిర్గతమగు చున్నది. మరియు శ్రద్ధావంతులకు ఆ కథలు ఉపదేశము లిచ్చునవిగాను, మరియు వానిని జ్ఞప్తికి తెచ్చునవిగా నున్నవి. 11-120

## 69. నూహ్

### 321. నూహ్ యొక్క ఉద్ధరణ

1. నూహ్ మమ్ములను పిలచెను. పిలుపునకు ఉత్తర మివ్వడానికి మేము చాలా జాలికలవారము.

2. మేము అతనిని, మరియు అతని ఇంటి వారిని గొప్ప దుఃఖము నుంచి విముక్తులను చేసితిమి. 37-75-76

### 322. శ్రద్ధాహీనుడగు పుత్రుడు పుత్రుడు కాడు

1. నూహ్ తన ప్రభువును పిలచి ఇట్లనెను. "ఓ ప్రభూ ! నా పుత్రుడు నా పరివారములోని వాడు, నిస్సందేహముగా నీ వాగ్దానము

సత్యము. నీవు నియంత లందరిలోను గొప్పవాడవు, శ్రేష్ఠతర మగు నియంతవును.

2. ఈశ్వరుడు (ఇట్లు) సమాధాన మిచ్చెను. ఓ నూహ్ ! అతడు నీ పరివారములోని వాడు కాడు. ఆలాగు అనుట ఒక చెడిన పని. అందుచే నీకు తెలియని విషయమై నీవు నన్నడుగకుము. మూర్ఖుడవు కావలదని నేను హెచ్చరించుచున్నాను. 11-45-46

## 70. ఇబ్రాహీం

### 323. ఇబ్రహీం కొరకు అగ్ని శీతలమయ్యెను.

1. ఇబ్రహీం ఇట్లనెను. ఏమీ ! మీరు ఈశ్వరుని కంటె వేరై, మీకు మంచిగాని చెడుగాని చేయలేని వారిని భజించెదరా ?

2, ఈశ్వరుని కంటె భిన్నమైన వారిపై భక్తి చూపించు మీ గురించియు, అటువంటి వస్తువుల గురించియు తిరస్కారము. దీనిని మీరు తెలుసుకొనుట లేదా !

3. మీరు ఏదైన చేయదలచుకొన్నచో, ఇతనిని కాల్చివేసి, మన భక్తులకు సహాయపడుడు.

4. (అపుడు) మేము ఇట్లంటిమి. ఓ అగ్నీ ! నీవు ఇబ్రహీం కొరకు శీతలుడవు, శాంతుడవు కమ్ము. 21-66-69

### 324. ఇబ్రాహీం యొక్క ఈశ్వర నిష్ఠ

1. ఇబ్రాహీం నుడివెను—మంచిది. ఎవరిని మీరు భజించుచున్నారో, వారి సంగతి చూచెదరు.

2. వారెవరనగా మీరును, మీ తండ్రి, తాతలును.

3. విశ్వ ప్రభువు తప్ప వారంతా నాకు నిశ్చయముగా శత్రువులు.
4. నన్ను పుట్టించిన వాడే నాకు మార్గదర్శకుడగు చున్నాడు.
5. అతడే నాకు ఆహారమును, పానీయమును నిచ్చువాడు.
6 నేను రోగ గస్థుడనై నపుడు అతడే ఆరోగ్యము నిచ్చువాడు.
7. అతడే నన్ను చంపు వాడును, జీవింప చేయు వాడును.
8. మరియు అతడే పునరుత్థాన దినమందు, నా దోషములను క్షమించ గలడని ఆశించుచున్నాను.
9. ఓ ప్రభూః నాకు విద్య నిచ్చి, నన్ను సజ్జనులలో చేర్చుకొనుము.
10. రాబోవు తరములవారికి నన్ను గురించి సరియగు పరిచయమును చేయుము.
11. ఆనందమయ స్వర్గమునకు పోవు వారిలో నన్ను చేర్చుకొనుము.
12. నా తండ్రిని క్షమించుము- అతడు భ్రాంతులలో ఒకడు.
13. మరియు పునర్థాన దినమందు నన్నవమానించకుము.
14. ఆ దినమందు సంతతి, సంపదలు ఉపయోగపడవు.
15. ఈశ్వరుని ఎదుటకు శుద్ధము, స్వచ్ఛమగు హృదయముతో వచ్చుటయే ఉపయోగకరము. 26-15-84

## 325. పితాపుత్రుల సంవాదము

1. ...............నిస్సందేహముగా అతడుఇ(బ్రాహిం) నిజమగు సందేష్ట (సందేశమిచ్చువాడు).
2. ఆయన తన తండ్రితో ఇట్లు నుడివెను, నీవు వినని, కనుగొనని మరియు పనికిరాని వానిని ఎందుకు భజించు చున్నావు?

3. ఓ తండ్రీ! నీకడకురాని జ్ఞానము నాకు లభించినది. కాబట్టి నేను చెప్పినట్లు నడువుము. నీకు నేను చక్కని మార్గము చూపించెదను.

4. ఓ తండ్రీ! సైతాన్‌ను కొలువకుము. నిస్సందేహముగా సైతాన్ ఆ కృపాళునికి విద్రోహి.

5. ఓ తండ్రీ! ఆ కృపాళునిచే ఏదైన ఆపత్తు వచ్చినచో నీవు సైతానుకు అనుచరుడవు కాగలవను భయము నాకు గలదు.

6. అటుపై ఇబ్రాహిం తండ్రి, ఇట్లనెను. "ఓ ఇబ్రాహిం నీవు నా భజనీయులతో విముఖుడ వైతివా? ఏమీ! నీవు ఈ తలంపు మానకున్నచో నీపై రాళ్ళు రువ్వి. రువ్వి నిన్ను చంపివేసెదను నీవు నా దగ్గర నుంచి సదాదూరుడవు గమ్ము.

7. అపుడు ఇబ్రాహిం ఇట్లనెను. నీకు సలాము (ఈశ్వరుడు నీకు శాంతి శరణ్యత నొసంగుగాక!) మా ప్రభువును నిన్ను క్షమించుటకు ప్రార్థించెదను. నిస్సందేహముగా అతడు (ఈశ్వరుడు) నాపై అత్యంత దయ గలవాడు.

8. నేను నీనుండియు మరియు ఈశ్వరుని కంటే వేరుగా నీవు భజించు వారి నుండియు దూరముగా తొలగిపోవు చున్నాను. నేను మా ప్రభువునే భజించెదను. మరియు నేను నా ప్రభువును భజించుట వలన అభాగ్యుడను, కానను నమ్మకము నాకు గలదు.

19-41-42.

## 326. ఇబ్రాహిం కోమల హృదయుడు.

1. కేవలము వాగ్దానమిచ్చిన కారణంగా ఇబ్రాహిం తన తండ్రి కొరకు ప్రభువును క్షమించ ప్రార్థించెను. కాని అతడు ఈశ్వరునకు

శత్రువని తెలియగానే అతడు తన తండ్రికి దూరమయ్యెను నిస్సందేహంగా ఇబ్రాహిం అతి కోమల హృదయుడు మరియు సహన శీలుడు. 9-114

## 327. ఇబ్రాహీం సుపుత్రుడు ఇస్మాయిలు

1. ఇస్మాయిలుకు పరుగెత్తగల వయస్సు రాగానే "బిడ్డా! నేను స్వప్నములో నిన్ను బలిఇచ్చు చున్నట్లు చూచితిని. మరి చూడు! ఈ విషయములో నీ అభిప్రాయ మేమిటని" ఇబ్రాహిం ప్రశ్నించెను. అపుడు ఇస్మాయిలు "ఓ తండ్రి! నీకు ఇవ్వబడిన ఆజ్ఞను పాలించుము. ఈశ్వరేచ్ఛ యున్నచో నీవు నన్ను సహన శీలునిగా చూచెద" వని చెప్పెను.

2. ఆ పైన ఉభయులు (ఈశ్వరుని) శరణు వేడిరి. మరి ఇబ్రాహిం తన కుమారుని బోర్లగిల పరుండ బెట్టెను.

3. అపుడు మేము ఓ ఇబ్రాహిం! అని పిలచి (ఇట్లుంటిమి)

4. నిస్సందేహంగా నీవు స్వప్నమును సత్యమని రుజువు చేసితివి. సత్కార్యములు చేయువారికి ఈ విధముగా ప్రతిఫలము నిచ్చుచుందుము.

5. నిస్సందేహముగా ఇదిగొప్పదగు నిశ్చితమగుపరీక్ష 37-102-101

# 71. మూసా

## 328. మూసా యొక్క ప్రార్థన స్వీకరించబడెను.

1. మూసా ఇట్లనెను : ఓ ప్రభూ! నా హృదయ కవాటమును తెరచి వేయుము.

2. మరియు నా కొరకు నా కార్యమును సులభమొనరించుము.

3. నా వాక్కు నుండి గ్రంధిని విడదీయుము.

4. ప్రజలకు నా మాటలు బోధపడుటకు (అట్లుచేయుము)

5. నా కుటుంబము నుంచి నా కొరకు ఒక సహకారిని నియమించుము.

6. హారూన్ అను నా సోదరుని—

7. అతని ద్వారా నా శక్తిని దృఢపరచుము.

8. మరియు అతనిని నా కార్యములో పాల్గొనునట్లు చేయుము.

9. అందుచే మేము నీ పవిత్రతను అత్యధికముగా కొనియాడగలము.

10. మరియు నిన్ను అత్యధికముగా స్మరించ గలము.

11. నిస్సందేహముగా నీవు మమ్ముల నిరీక్షించు వాడవు.

12. (ఈశ్వరుడు) చెప్పెను ఓ మూసా: నీవు అర్థించినది, నీకు ప్రసాదించ బడెను. 20-25-36.

## 72. ఏసు క్రీస్తు

### 329. ఏసు యొక్క ధన్యోక్తి

1. ఏసు ఇట్లనెను. నేను నిస్సందేహంగా ఈశ్వరుని బంటును. అతడు నాకు గ్రంధమును ప్రసాదించెను. మరియు నన్ను సందేశ వాహకునిగా జేసెను.

2. మరియు నేను ఎచ్చట నున్నను, నన్ను ధన్యాత్మునిగా చేసెను. జీవితాంతము వరకు ప్రార్థన, మరియు నియమిత దానము చేయుటకు నన్నాదేశించెను.

3. మరియు నా తల్లి పట్ల సద్వర్తనతో మెలగువానినిగా నన్ను చేసెను. నన్ను అత్యాచారముచేయు దుర్భాగ్యునిగా చేయలేదు.

4. నేను జన్మించిన దినము, మరణించు దినము మరియు మరల జీవితుడనై లేచుదినము నా కొరకు ధన్యములు.

5. ఇతడే మరియమ్మ పుత్రుడు ఏసూ! 19-30-35.

## 330. ఏసును శిలువ నెక్కించుట ఒక భ్రాంతి.

1. మరియమ్మ పుత్రుడు ఏసుక్రీస్తు, ఈశ్వరీయ ప్రేషితుని మేముహత్య చేసితిమని వారను చున్నారు. (దానికి మేమిచ్చే ఉత్తరము ఇది.) వారు అతనిని చంపలేదు. శిలువ వేయనూలేదు. అయితే ఇట్లనుటకు వారు భ్రాంతిలో పడవేయబడిరి. ఈ విషయమై ఎవరికి వ్యతిరేకత గలదో వారు, తప్పించుకొనరాని సందేహములో గలరు. వారికి ఈ విషయమై ఎరుకయే లేదు. వారు కేవలము ఊహాగానముల మీద నడచుచున్నారు. నిశ్చయముగావారు అతనిని (ఏసును) చంపలేదు.

2. అయితే ఈశ్వరుడు అతనిని (ఏసును) తన సన్నిధికి చేర్చుకొనెను ఈశ్వరుడు సర్వజితుడు, సర్వవిదుడు. 4-157-158.

## 331. ఏసు గురువు పవిత్రుడు జాన్

1. మేమిట్లంటిమి. ఓ జాన్! గ్రంథమును దృఢముగా స్వాధీనము నందుంచు కొనుము. అతనికి బాల్యమునందే మేము విద్యాదానము చేసితిమి.

2. మరియు ఆర్ద్ర హృదయమును, పవిత్రతను ఒసంగితిమి. అతడు ఈశ్వర పరాయణుడై ఉండెను.

3. తన మాతా పితరుల యెడ సద్వర్తనతో మెలగువాడై యుండెను. విద్రోహి మరియు అహంకారి గాకుండెను.

4. అతడు ధన్యుడు. అతడు జన్మించిన దినము, మరణించు దినము మరియు పునర్జీవించి లేచు దినము ధన్యములు. 19-12-15

## 332. ఏసు అనుచరులు

1. శ్రద్ధావంతుల మైత్రిలో క్రిష్టియన్లమని చెప్పుకొనువారు మిక్కిలి సన్నిహితులు. కారణము వారిలో కొందరు విద్వాంసులును, భక్తి పరులును, మదస్థులగు సాధువులును గలరు. వారికి గర్వము లేదు.

2. దూతకు అందించబడిన సందేశ వచనములు వినినపుడు వారి నేత్రముల నుండి ఆనందాశ్రువులు చిలుకుచున్నవి. వారు సత్యాన్ని గుర్తించడమే ఇందుకు కారణము. మరియు వారు ఓ ప్రభూ, మేము శ్రద్ధావంతుల మైత్రిమి, సాక్షులతో వ్రాసుకొమ్మని చెప్పుదురు. 5-85-86

# 73. ప్రసక్తికి రాని దూతలు

## 333. నిర్దేశితులు కాని దూతలు

1. నీకన్న ముందు మేము దూతలనేకుల పంపితిమి. వారిలో కొందరిని మేము నీతో ప్రస్తావించితిమి. కొందరి గురించి నీతో ప్రస్తావించ లేదు. 40-78

# 27. మహమ్మదు పైగంబరు

## 74. సాక్షాత్కారము

### 334. ప్రథమ సాక్షాత్కారము

1. చదువు, ఎవరు నిన్ను సృష్టించిరో ఆ ప్రభువు పేరుతో (చదువు)
2. అతడు ఘనీభవించిన రక్తముచే మానవుని సృష్టించెను.
3. చదువు, అతడు గొప్ప ఉదారుడు.
4. అతడే లేఖినీ ద్వారా విద్య నేర్పెను.
5. మరియు మానవునికి తెలియని దంతయూ నేర్పెను  96_1_5

### 335. దివ్యానుభవము

1. ఎవడు ఒకరాత్రి తన భక్తుని పవిత్రయగు ఒక మసీదు నుంచి దూరమున గల మరొక మసీదు వరకు తీసుకొని వెళ్ళెనో, అతడు పరమ పవిత్రుడు. ఈశ్వరీయ చిహ్నములను దర్శింపు చేయుటకు మేము ఆ పరిసరాలను మంగళ ప్రదముగా నుండునట్లు చేసితిమి. నిస్సందేహముగా ఈశ్వరుడు వినువాడు, కనువాడు.

### 336. సంశయరహిత సాక్షాత్కారము

1. మరి ఈ నీ సహచరుడు పిచ్చివాడు కాడు.
2. ఆయన (జిబ్రాయిల్) [illegible] నున్న ఆకాశము యొక్క క్షితిజముపై దర్శించెను.

8. మరియు అతడు అవ్యక్తమునకు సంబంధించిన మాటల తెలుపుటలో లోభి కాకుండెను. 81-22-24

# 75. ఈశ్వరుడు ప్రసాదించిన ఆదేశము

## 337. ప్రత్యేక ప్రార్థనకు ఆదేశము

1. సూర్యాస్తమయములు మొదలుకొని రాత్రి అంధకారము వరకు నియమముగా ప్రార్థన చేయుము. ప్రతిదినము ఉషఃకాలమునందు కురాన్‌ను పఠించుము. 'నిశ్చయముగా ఉషఃకాలమందు చేయు కురాన్ పఠనము చూడదగినది.

2. మరియు రాత్రిళ్ళు కురాన్ పఠనముతోపాటు ప్రత్యేక ప్రార్థన చేయుము. ఇది నీ కొరకు చెప్పబడిన విశేషమగు ప్రార్థన. (ఇట్లు చేయుటచే) నీ ప్రభువు నిన్ను ఉత్తమ స్థానములో చేర్చునను ఆశ గలదు.

3. మరియు చెప్పు - ఓ ప్రభూ ! నన్నెచటికి తీసుకొని పోయినను, నన్నెచట నుంచి వెళ్లదీసినను, సత్యమునే ఆధారముగా యుండనిమ్ము. మరి నీ సహాయము లభ్యము కాగల అధికారమును నాకు ప్రసాదించుము.

4. ఇంకను చెప్పు :– సత్యము ప్రకటితమయ్యెను, అసత్యము నశించెను. నిస్సందేహంగా అసత్యము నశించునదే. 17–78–81

## 338. కేవలము (నీవు) సందేశవాహకుడవు

1. మేము ఇచ్చిన వాగ్దానములు, నీకు కనబరచినను, లేక నిన్ను లేవనెత్తినను, కేవలము సందేశము అందజేయడమే నీ పని. లెక్కగైకొను కర్తవ్యము మాది. 13-40

## 339. ఉపదేశము నీ పని గాదు

1. నిస్సందేహముగా నీవు శవములకు వినిపించ లేవు. (అదేవిధిని) విముఖులై వెళ్ళిపోవు చెవిటి వారలకు (వినిపించజాలవు).

2. మరియు భ్రాంతులగు అంధులకు కూడా మార్గదర్శనము చేయ లేవు. కాని నా చిహ్నములపై విశ్వాసముంచి నన్ను శరణు జొచ్చిన వారికి మాత్రమే వినిపించ గలవు. 27-80-81

## 340. మహమ్మదు మరియు అంధుడును

"ఈశ్వరుని కృప ఎవరిపైబడునో ఎవరెరుగుదురు?"

1. రసూలు కనుబొమలు ముడిచి (చిట్లించి) పెడ ముఖము పెట్టెను.
2. అపుడు అకస్మాతుగా ఒక అంధుడు అతని చెంతకు వచ్చెను.
3. బహుశః వాడు పవిత్రుడగునేమో నీకేమి తెలియును.
4. లేక ధ్యాన పరుడగుచో ఉపదేశ మిచ్చుట అతనికి లాభము చేకూర్చ వచ్చును.
5. అందువల్ల ఎవరు నిర్లక్ష్యము చేసినను,
6. వారి యందు నీవు దృష్టి నుంచుచున్నావు.
7. ఆలోచించినచో వాడు, బాగుపడలేదన్న దోషము నీపై నుండబోదు.
8. మరియు ఎవడు నా దగ్గరకు పరుగెత్తుకొని వచ్చెనో,
9. వాడు (నిన్ను) చూచి భయపడు చున్నాడు.
10. అయినను అతని వైపునుండి నీవు నీ దృష్టిని తప్పించుచున్నావు.

80-1-10

## 341. నిర్భయముగా సందేశమందించుము

1. ఓ సందేష్టా! నీ ప్రభువుచే అందించబడిన ప్రజ్ఞానమును, నీవు ప్రజల కందించుము. నీవు ఇట్లు చేయకున్న అతని సందేశము నందించని వాడవు కాగలవు. అయితే ఈశ్వరుడు నిన్ను విరోధుల నుంచి కాపాడగలడు. 5-70

## 342. ఎవరు ఏమన్ననూ నీవు మరణము వరకు ఈశ్వరుని భజించుము

1, వారు అను మాటలకు తప్పక నీ మనసు బాధపడుచున్నదని మాకు తెలియును.

2. అయినను నీవు నీ ప్రభువును స్తుతించుచూ, అతని పవిత్రతను వర్ణించుచుండుము.

3. ఇంకనూ నీకు మరణము ఆసన్నమగు వరకు నీ ప్రభువును భజించుచుండుము. 15-95-99

## 343. అంతిమ నిర్ణయము వరకు సహచరులతో సమాలోచించు.

1. నీవు ఆ ప్రజల కొరకు కోమల హృదయుడవు కావడము ఈశ్వరుని కృప. నీవు కఠోర కర్కశ హృదయుడవగుచో వారు నీచుట్టు ప్రక్కల నుంచి తొలగి వెళ్ళిపోవు వారు. అందువల్ల నీవు వారిని క్షమించు. మరియు వారిని క్షమించుటకు నీవు ఈశ్వరుని ప్రార్థించు. నీ కార్యములలో వారితో సలహా గైకొను. పిమ్మట నీవు దృఢనిశ్చయుడవై ఈశ్వరునిపై విశ్వాసముంచుము.

నిస్సందేహముగా తన ప్రభువు సాన్నిధ్యము గమనించి ప్రేమించు చున్నాడు. 3-15

## 344. నన్ను తలచి కర్తవ్యము చేయుము

1. మేము నీకొరకు నీ వక్షస్థలమును విశాలపరచి ఉంచలేదా?
2. మరియు మేమే నీమీద గల భారమును దింపి వైచితిమి.
3. ఆ భారము నీ వీపును విరుగగొట్టినది.
4. మేము నీ కీర్తిని నీకొరకు పెంచితిమి
5. అయితే కష్టముతోపాటు నిస్సందేహముగా సౌఖ్యము గలదు.
6. నిస్సందేహముగా కష్టములలో సుఖమున్నది.
7. అందువలన నీవు ఒక కార్యము నుండి విముక్తుడవు కాగానే తిరిగి ప్రయత్నము చేయుచుండుము.
8. మరియు ప్రభువు వైపు ధ్యానముంచుము. 84-1-8

## 345. తనతో బాటు సమానముగా చూడు - అను బోధ

1. ప్రొద్దెక్కు దినముతో శపథము
2. వ్యాపించుచున్న రాత్రి తోడను.
3. నీ ప్రభువు నిన్ను త్యజించ లేదు. మరియు నీయెడ అప్రసన్నుడు కాలేదు.
4. నిశ్చయముగా నీ పూర్వ జీవితము కంటే నీ ఉత్తర జీవనము మిగుల ఉత్తమమైనది.

5. నీ ప్రభువు నీకు అవశ్యము ప్రసాదించును దానిచే నీవు సంతుష్టుడ వగుదువు.

6. ఏమీ! అతడు నిన్ను మొదట అనాథునిగా కనుగొనలేదా? పిదప నీకు ఆశ్రయమిచ్చెను గదా!

7. మరియు నిన్ను మార్గ భ్రష్టునిగా చూచి నీకు మార్గమును చూపించెను

8. మరి నిన్ను దరిద్రునిగా చూచి సంపన్నునిగా చేసెను.

9. కాన, అనాథులగు వారిని పీడించకుము.

10. మరి యాచించ వచ్చిన వారిని ఈసడించకుము.

11. నీ ప్రభువు యొక్క వరప్రసాదములను వెల్లడించుచుండుము.

93-1-13

## 76. ఘోషణ

### 346. ఆదేశ పంచకము

1. చెప్పు :- నేను కేవలము ఒక మాటను నా మాటగా చెప్పుచున్నాను. మీరు ఈశ్వరుని కొరకు ఒక్కరొక్కరుగాను, ఇద్దరిద్దరుగానూ నిలబడుడు, పిమ్మట మీ ఈ సహచరునకు వెఱ్ఱి ఎత్తినదా అని ఆలోచించుడు. అతడు ఒక పెద్ద ఆపద నుంచి లదిరాక పూర్వమే మిమ్ముల జాగృతులను చేయుచున్నాడు.

2. చెప్పు :- నేను మీ నుంచి ప్రతిఫలమేదైనను కోరినచో దానిని మీరే ఉంచుకొనుడు. నా పుణ్యఫలము ఇచ్చు బాధ్యత ఈశ్వరునిది. అతడు సర్వద్రష్ట.

3. చెప్పు :- నిస్సందేహముగా నా ప్రభువు సత్యమును ఆవిష్కరించు చున్నాడు. అతడు అవ్యక్తము యొక్క పరిజ్ఞాత.

4. చెప్పు :- సత్యము ప్రకటితమయ్యెను. అసత్యము దేనిని సృష్టించ లేదు. లేక సృష్టించిన దానిని తిరిగి తేలేదు.

5 చెప్పు :- ఒక వేళ నేను భ్రాంతుడనైనచో, కేవలము నాకొరకే, భ్రమించిన వాడనగుదును. నాకు బోధ లభించినచో దానికి నా ప్రభువు నా ద్వారా ప్రజ్ఞానము పంపడమే కారణము. నిస్సందేహముగా అతడు సర్వశ్రుతుడు, సన్నిహితుడు. 35-46-50

## 77. గుణ సంపద

### 347. ప్రార్థనా మయత

1. నీవును, నీ సహచరులలో కొందరును, రాత్రిళ్ల మూడింట రెండు భాగములు మరియు అర్థరాత్రి వేళల ప్రార్థనలో నిలబడి యుండుటను నిస్సందేహముగా మీ ప్రభువు ఎరుగును. 73-20

### 348. ఈశ్వరుని సతత సాన్నిధ్యము

1. మీరు ప్రవక్తకు సహాయపడకున్ననూ, ఆయనను శ్రద్ధాహీనులు వెడలగొట్టినపుడును ఈశ్వరు డతనికి సహాయపడెనని నిశ్చయ పూర్వకముగా తెలిసికొనుడు. అప్పుడతడు ఇద్దరిలో రెండవవాడై యుండెను. గుహలో నుండినపుడు తన వెంటనున్న వానితో (సహచరునితో) నిట్లనెను. "దుఃఖించకుము - పరమాత్ముడు నిశ్చయముగా మన వెంట గలడు."

అట్టి సమయమందు పరమాత్ముడు అతనికి చిత్తశాంతిని కలిగించెను మరియు మీకు కంటికి కనబడని సైన్యముచే సహాయ పడెను. శ్రద్ధాహీనుల మాటలు వ్యర్థము పరమాత్ముని మాటలు నిశ్చయమయ్యెను. ఈశ్వరుడు సర్వజితుడు, సర్వవిదుడు.

## 349. ఈశ్వర భక్తికి ఆదర్శమైన ఉదాహరణము

1. ఈశ్వరుని యెడను, అంతిమ దినము పట్లను, మరియు ఈశ్వరుని సదా స్మరించు వారి కొరకు దూత చక్కని ఉదాహరణము 33–21

## 350. దూత మరియు శ్రద్ధావంతుల సంబంధము

1. శ్రద్ధావంతులకు తమ ప్రాణము కన్న అధికమగు సన్నిహిత సంబంధము సందేష్టతో కలిగియున్నది. 33_6

## 351. పూర్వ జీవనముచే ప్రామాణికతా సిద్ధి

1. చెప్పు :_ ఈశ్వరుని ఇష్టానుసారమే నేను అతని వచనములు మీ ముందు వల్లించితిని. లేకున్న చెప్పే వాడను గాను. మరియు మీకు ఈ సమాచారము అందక పోయేది. వాస్తవమేమన ఇంతకు పూర్వ జీవనములో నేను మీతో కొంతకాలము గడపితిని. అయితే మీరు ఇంతమాత్రము అర్థము చేసుకొనరా ?

10_16

## 352. చదువురాని ఈశ్వర భక్తుడు

1. ఓ ప్రజలారా ! నేను మీ అందరి సముదాయమునకు భూమ్యాకాశములకు అధిపతి యగు పరమాత్మచే పంపబడితిని. అతడు తప్ప వేరొక

నియంత లేడు. అతడే బ్రతికించును, అతడే గిట్టించును. కాన పరమాత్మ యందు అతడు పంపిన చదువురాని దూత యందు శ్రద్ధగలిగి యుండుడు. ఆ దూత ఈశ్వరుడు మరియు అతని వచనముల పట్ల శ్రద్ధగలవాడు. కాబట్టి మార్గప్రాప్తికై మీరు అతనిని అనుసరించుడు 7-158

## 353. ఈశ్వరుడు మహమ్మదును దృఢ పరచెను

1. మేము ప్రజ్ఞాన రూపములో నీకందించిన వస్తువు నుండి ఆ ప్రజలు నిన్ను విచలితుని చేసి, నీ చేత భిన్నమగు మరొక మార్గమును నా పేర కల్పింప జూచుచుండిరి. అలాగు జరిగినచో వారు నిన్ను మిత్రునిగా చేసుకొను వారు

2. అయితే మేము నిన్ను ఆదుకొననిచో నీవు తప్పక కొంతవరకైనను వారికి లొంగిపోయి యుండెడి వాడవు. 17-73-74

## 354. అందరిది వినువాడు

1. వారిలో కొందరు ప్రవక్తకు దుఃఖము కలిగించి అతడు చెవి వంటి వాడని, అందరిది వినునని అనుచుందురు. కాని చెప్పు :- ఆ చెవులు మీ మేలు కొరకై యున్నవి. అతడు పరమాత్మునిపై శ్రద్ధ గలవాడు, మరియు శ్రద్ధావంతులపట్ల విశ్వాసము గలవాడు మీలో ఎవరు శ్రద్ధ గలవారో, వారి కొరకు అతడు కరుణా రూపుడు 9-61

## 355. బహుసంఖ్యచే ప్రభావితుడుగాని వాడు

1. ప్రపంచములో అధిక సంఖ్యాక ప్రజలు ఊహాగానములు చేయుచూ, కల్పనలో నుండువారై యున్నారు. వారి మాటలే వినుచుంటివా ?

వారు నిన్ను ఈశ్వరుని మార్గము నుంచి భ్రష్టుని చేయగలరు
73-6-116

# 78. ప్రేషితుని విధి

## 356. రసూలు, ఈశ్వరుని వరప్రసాదము

1. మేము నిన్ను ప్రపంచ ప్రజల కొరకు, కరుణా స్వరూపునిగా చేసి పంపితిమి. 21-107

## 357. పంచ విధికార్యములు

1. ఓ ప్రవక్తా! మేము నిస్సందేహముగా నిన్ను మార్గదర్శకునిగాను, శుభసందేశ మిచ్చు వానిగాను, మరియు జాగృతి కలిగించు వాని గాను, చేసి పంపితిమి.

2. మరియు ఈశ్వరుని ఆజ్ఞతో అతని పక్షాన ఆహ్వానించే వానిగాను, ప్రకాశమిచ్చు దీపమును గాను చేసి పంపితిమి. 83-45-46

# 79. ఆశీర్వాద పాత్రుడు

## 358. మహమ్మదు కొరకు అశీర్వాదములు అభ్యర్థించుడు

1. నిస్సందేహముగా ఈశ్వరుడు మరియు దేవదూతలు ప్రవక్తకు ఆశీస్సులు పంపుచున్నారు. ఓ శ్రద్ధావంతులారా! మీరు గూడ ఆశీస్సుల నందజేయుడు. 83-26



# నవము ఖండము

# 28. తత్త్వజ్ఞానము

## 80. జగత్తు

### 359. సృష్టిలోని గంభీరమగు హేతువు

1. మేము ఆకాశములను, భూమిని మరియు వానిలో గల సర్వస్వ మును వ్యర్థముగా సృజింపలేదు

2. ఒక వేళ వేడుకకు చేయదలచుకొన్నచో, దానిని అట్లే మేము చేయగలవారము, కాని అట్లు చేయదలచలేదు. 21-16-17

### 360. సృష్టి రచన నిరర్థకము గాదు

1. సదా లేచునపుడు, పరుండునపుడు, కూర్చుండునపుడు ఈశ్వర స్మరణ చేయు వారు భూమ్యాకాశముల కౌశల్యము గురించి చింతన చేయుచో, ఓ ప్రభూ! ఈ సర్వము ఉద్దేశ్య రహితము మరియు వ్యర్థముగా చేయలేదని భావించుచుందురు. 3—191

## 81. జీవుడు

### 361. జీవ నిర్మాణము ఉద్దేశ్యముతో కూడినది

1. ఏమీ! మేము మిమ్ములను వ్యర్థముగా సృజించితిమని కల్పన చేసు కొంటిరా? మరియు నావైపునకు మీరు తిరిగి రామను కొంటిరా? 23-115

## 362. నిద్ర మృత్యువుకు పూర్వ ప్రయోగము

1. అతడే రాత్రులందు మీ ప్రాణములను లాగుకొను చున్నాడు మరియు దినమందు మీరు చేయు కార్యకలాపములను తెలుసుకొను చున్నాడు. నియమిత గడువు పూర్తి యగు నప్పటికి మిమ్ముల లేపుచున్నాడు. మీరు అతనివైపే తిరిగిపోవలసి యున్నది. అపుడు అతడు, మీరేమి చేసినది, చేయుచున్నది చెప్పగలడు. 6-60

## 363. నిద్ర మరియు మృత్యువు

1. ఈశ్వరుడు మరణ సమయమున జీవుల ప్రాణములను లాగివేయు చున్నాడు. మరియు మృత్యువు రాని వారల ప్రాణమును నిద్రా స్థితిలో లాగుచున్నాడు. తరువాత మృత్యువు నిర్ణయమైన వారిని ఆపుచు, మిగతా వారి ప్రాణశక్తిని నిశ్చిత గడువు వరకు మరల సంచరింప చేయుచున్నాడు. చింతన మనన చేయు వారికి ఇందులో చిహ్నములున్నవి. 39-42

## 364. జీవసంబంధమైన ప్రశ్న

1. ఈ ప్రజలు జీవుని గురించి నిన్ను ప్రశ్నించెదరు. చెప్పు :- జీవుడు నా ప్రభువు ఆజ్ఞచే ఉన్నాడు. మీరు, జ్ఞానములో అల్పాంశమునే పొందితిరి.
2. మేము తలచినచో, నీవైపు ప్రజ్ఞాన రూపములో అందించిన వస్తువును తిరిగి తీసికొని పోగలము. 17-85-86

## 365. అవ్యక్తము తెలియరానిది

1. చెప్పు :- నావద్ద పరమాత్ముని నిధులు గలవని చెప్పుటలేదు. అవ్యక్తములో ఏమి గలదో నాకు తెలియదు. నేను దూతను కాను. కాని నాకు ప్రాప్తమైన ప్రజ్ఞానమును అనుసరించు వాడను. 6-50

### 366. అవ్యక్తము యొక్క జ్ఞానమున్నచో !

1. చెప్పు :- ఈశ్వరేచ్ఛ తప్ప నాకు నేను లాభ-నష్టములు పొందు నధికారిని గాను నాకు అవ్యక్తము యొక్క జ్ఞానమున్నచో, మంచి నుండి కావలసినది, గ్రహించే వానిని మరియు చెడ్డ నాకు అంటకనే యుండేది. 7-188

### 367. అనవసర ప్రశ్నలు వేయకుడు

1. ఓ శ్రద్ధావంతులారా ! ఉత్తర మిచ్చినచో మిమ్ములను సంకట గ్రస్తులను చేయు మాటలను అడుగకుడు 5-104

## 82. అంతర్యామి

### 368. ఇష్టముగల వారికి ప్రజ్ఞానము అందించును.

1. సర్వోన్నత ప్రతిష్ఠుడు, రాజరాజేశ్వరుడు తన భక్తులలో ఇష్టులగు వారికి ప్రజ్ఞానము అందించును. దానివల్ల వారు అంతిమ దినము యొక్క సంగతి సందర్భముల నుండి జాగ్రుతులు కాగలరు. -140

### 369. జీవాంతర్యామి

1. ఓ శ్రద్ధావంతులారా ! మీరు ఈశ్వరుడు మరియు అతని దూతల ఆజ్ఞలను పాలించుడు. అతడు మిమ్ములను, ఉత్తమ జీవనము ప్రధానము చేయుటకు పిలుచుచుండును. మనుజుడు మరియు అతని హృదయము మధ్యను ఈశ్వరుడు అంతర్యామిగా నున్నాడని ఎరుంగుడు. మీరందరూ అతని చెంతకే చేర్చబడుదురు. 8-24

# 29. కర్మవిపాకము

## 83. కర్మవిపాకము మరియు దానికి సబంధించిన మూలమైన విశ్వాసము

### 370. ఏకాదశ సూత్రములు

1. బరువు మోయు వాడెవడునూ మరియొకని బరువు మోయ జాలడు.
2. మనుజునికి తాను చేసిన ప్రయత్నమే తనదై యుండును.
3. వాని ప్రయత్నము తప్పక చూడబడును.
4. మరియు వానికి ఆ ప్రయత్నము యొక్క ప్రతిఫలము సంపూర్ణ ముగా లభించును.
5. నీ ప్రభువు చెంతకే అందరు చేరవలసి యున్నది.
6. అతడే నవ్వించు వాడు, ఏడ్పించు వాడును.
7. అతడే చంపును మరియు బ్రతికించును.
8. అతడే స్త్రీ, పురుషుల జతను నిర్మాణము చేసెను.
9. (ఆ నిర్మాణము) ఒక బిందువుచే అది చుక్కలు-చుక్కలుగా రాల్చబడుచుండును.
10. రెండుసార్లు పుట్టించగల బాధ్యత అతనిదే
11. అతడే సమృద్ధి నిచ్చును. మరియు సంతృప్తికలుగ జేయును.
12. మరి అతడే లుబ్ధకనక్షత్రమునకు ప్రభువు (ధ్రువతార)

53-38-49

# 84. కర్మవిపాకము, అపరిహార్యము

## 371. స్వయముగా చేయవలసిన పని

1. ఓ శ్రద్ధావంతులారా! మీరు మీ ఆత్మచింతన చేసికొనుడు. మీరు సన్మార్గములో ఉంటిరా ఇతరుల భ్రష్టత్వము వల్ల మీకు కాగల చెరుపు ఏమియు లేదు. ఈశ్వరుని సన్నిధికే మీరంతా తిరిగి పోవలసి యున్నది. అపుడతడు మీరేమి చేయుచున్నది చెప్ప గలడు. 5_108

## 372. ఉత్తరదాయిత్వము మీదే

1. సన్మార్గము అవలంబించు వాడు తన మేలుకొరకే అట్లు చేయు చున్నాడు. మార్గభ్రష్టుడైన వాడు తన చెరుపు కొరకే దారి తప్పును. బరువుమోయు వాడెవడును ఇతరుల చెరుపును మోయ జాలడు. 17_15

## 373. మనుష్యుడు మారినప్పుడే ఈశ్వరుడు మార్పును కలిగించును

1. వాస్తవముగా ఈశ్వరుడు ఏ సమాజము వారి పరిస్థితిని ఆ సమాజపు మనుష్యులలో ఆంతరంగిక పరివర్తన రాబడు వరకు మార్చబోడు ఈశ్వరుడు ఏ సమాజము మీద ఆపదను వేయ దలచుకొన్నను, అది తప్పునది కాదు ఈశ్వరుడు తప్ప మరెవరు వారికి సహాయపడు వారు లేరు. 13-11

## 374. తనకు తానే శత్రువు

1. నీవు చేతులార చేసికొన్నదే నీకు కలిగే కష్టనష్టాలకు కారణము. ఈశ్వరుడు అనేక పాపములను క్షమించుచునేయున్నాడు. 42-30

## 375. పుణ్యమునకు ఫలము పదిరెట్లు

1. పుణ్యము చేయు వారికి ఫలము పదిరెట్లు వరకు గలదు. పాపమునకు సమానమగు ప్రతిఫలమే ఇవ్వబడును. మరియు పాపము చేయు వారిపై ఎట్టి అన్యాయము చేయబడదు. 6-160

## 376. మంచికి పరిణామము మంచియే

1. శుభమునకు పరిణామము శుభమే. 65-60

## 377. పృథ్వి విశాలమైనది

1. ఓ శ్రద్ధావంతులగు భక్తులారా! ఈశ్వర పరాయణులు కండు. ఈ జగత్తులో మంచి చేయు వారికి మంచి ప్రతిఫలమే లభించును. ఈశ్వరుని భూమి విశాలమైనది. నిశ్చయముగా సహనశీలురకు అగణితమగు పుణ్యఫలము లభించును. 89-10

## 378. సద్వచనములు మరియు సత్కృతుల ప్రతిష్ఠ

1. ప్రతిష్ఠను కోరువారు ఆ ప్రతిష్ఠ ఈశ్వరుని కొరకే యని తెలుసు కొనవలెను సద్వాక్కులు అతని వద్దకే చేరుచున్నవి. సత్కర్మలు చేయు వారికి అతడు ఉన్నతిని చేకూర్చుచున్నాడు. చెడుపోకడలు పోవు వారికి కఠినమగు దండనయే గలదు. మరియు వారి కపటము నష్టమగును. 35-10

# 85. కర్మ మరణానంతరమందు గూడ పోవదు

## 379. ఇచట అంధుడగువాడు అచ్చటను అంధుడే!

1. ఈ లోకమున (ఈశ్వరుని విషయమై) ఎవడు అంధుడై యుండునో, వాడు అంతిమ దినమందు అంధుడుగానే యుండును.

మరియు మార్గమును అత్యధికముగా తప్పిన వాడగును 17-72

## 380. ఈశ్వరుని త్రాసు

1. పునరుత్థాన దినమందు మేము న్యాయము చేయు త్రాసును ఉంచెదము. (దానివల్ల) ఏ ప్రాణి మీదను, ఎట్టి అన్యాయము జరుగనేరదు. వారు చేసిన కర్మ ఆవగింజంత యున్నను మేము దానిని సమక్షముకు తేగలము గణితము చేయుటలో మేము గట్టివారము, ఘనులము. 21-47

## 381. భూమి కంపించును

1. భూమి భూకంపము వచ్చి కదలినపుడు

2. భూమి తన బరువును విసరివేసినపుడు,

3. అపుడు మనుష్యుడు భూమికి ఏమయినదని అడుగును.

4. ఆ దినమున భూమి తన సంగతులను చెప్పును.

5. ప్రభువు ఆజ్ఞాపించుట వల్లనే (అట్లు చెప్పుకొనును).

6. ఆ దినమందు ప్రజలు చెల్లాచెదరై బయట పడుదురు.

7. వారు చేసిన కృత్యములను చూచుటకే అట్లు చేయబడును. అణు మాత్రము మంచి చేసినను, దానిని వారు గాంచ గలరు.

8. మరియు ఎంత కొద్ది చెరువు చేసినను వారు దానిని చూడగలరు. 99-1-8

## 382. హాల్కా-పల్లా, ఖారిపల్లా

1. ఆభయము కలిగించేది

2. ఆభయము కలిగించేది, యేమిటని

3. అభయము కలిగించేది యేమిటని నీవు గ్రహించితివి.

4. ఏ దినమందు ప్రజలు గాలిపటముల వలె చెల్లాచెదరై యుందురో,

5 మరియు పర్వతములు ఏకిన రంగు ఉన్నివలె నుండునో,

6. అపుడు ఎవరి స్థాయి గొప్పదగునో

7. వారు సంతోషప్రదమగు జీవనములో నుందురు.

8. ఎవరి స్థాయి అల్పమైనదో,

9. గోతియే వారి నివాసము అగును.

10. అదేమిటో (గోయి), నీవేమి తెలుసుకొంటివి?

11. ధగ ధగ మండుచున్న అగ్ని (బడబాగ్ని) 10-1-1-11



# 20. మరణానంతర జీవితము

## 86. పునరుత్థానము తప్పదు

### 383. రాతిగా నున్నను లేక లోహమైనను

1. ఎముకలు చూర్ణమై చితికి పోయినపుడు, మమ్ములను సరిక్రొత్తగా పుట్టించి లేపుదురా యని వారనుచుందురు.

2. చెప్పు :- మీరు రాయిగాను, లేక లోహముగాను, లేక మీ మనసుకు నచ్చిన ఏ పెద్ద వస్తువుగానైనను సరే (మళ్ళీ లేపబడుదురు).

3. అపుడు వారు " మమ్ముల ఎవరు తిరిగి తీసుకరాగలరు " అని అడిగితే, చెప్పు :- మిమ్ముల తొలిసారి పుట్టించిన వాడే నని...

17-49-51

### 384. పరితప్త హృదయము యొక్క సాక్ష్యము

1. పునరుత్థాన దినములో

2. చెడును నిందించు మనసుతోను శపథము చేసి చెప్పుచున్నాడు.

3. ఏమీ ! మానవుడు అతని ఎముకలను ఒకచోటికి (మేము) తీసుక రాలేమని భావించుచున్నాడా ?

4. ఎందుకు తీసుకురాలేము ? వాని చేతివ్రేళ్ళ కణుపు, కణుపును సరిచేయ సమర్థులము. 75-1-4

# 87. పునరుత్థాన దినము

## 385. పునరుత్థాన దినము ఒక యదార్థము

1. ఎగురగొట్టి చెదరిపోవు వాయువుల శపథము.
2. మరియు బరువుమోయు వస్తువుల శపథము.
3. మరి నమ్రతతో సంచరించు వస్తువుల శపథము.
4. మరి ఆజ్ఞచే విభాగించు వస్తువుల ప్రమాణము.
5. నిస్సందేహముగా మీతో ఏ వాగ్దానము చేయబడినదో అది సత్యము.
6. మరియు నిస్సందేహముగా న్యాయము తప్పక జరుగ గలదు.

51-1-6

## 386. "ఎవరికి వారే యమునాతీరే"

1. చెవులు బ్రద్దలగు నట్లు ధ్వని ఎప్పుడు రానిందో,
2. ఆనాడు మనుజుడు తన సోదరుని విడచి పరుగిడు చున్నాడు.
3. మరి తన తల్లిదండ్రులను,
4. తన సహచారిణి (పత్ని) ని, సంతతిని (విడచి),
5. ఆ దినమందు వారిలోని ప్రతివాని స్థితి తనవరకే పరివ్యాప్తమై యుండును.

80-33-37

## 387. ఎట్టి సిఫారసు సాగదు

1. ఎవరు, ఎవరికి ఏ దినమందు ఉపయోగపడరో ఆ దినము నుండి భయపడుడు. (ఆ దినమందు) ఎవరి నుంచి ఎట్టి పరిహారము.

స్వీకరించబడదు. మరియు ఎవరి సిఫారసు అంగీకరించబడదు. అపుడు (ఎవరికి) ఎవరి నుండి ఎట్టి సహాయము లభించదు.

2-128

## 388. ద్వాదశ చిహ్నములు

1 ఏ దినమున సూర్యుడు తల్లక్రిందుల చేయబడునో

2. మరియు (ఎపుడు) నక్షత్రములు రాలిపోవునో,

3. మరియు ఎపుడు పర్వతములు కదలింపబడునో

4. ఎపుడు దశమాసములు నిండిన ఆసన్న ప్రసవలగు ఒంటెలు వదలి పెట్టబడి తిరుగుచుండునో.

5. ఎపుడు వన్యపశువులు ఒకే చోటికి చేర్చబడునో,

6. మరియు ఎపుడు సముద్రము ఉప్పొంగించబడునో,

7. మరియు ఎపుడు ప్రాణులు (ఒకచో) చేర్చబడునో,

8. సజీవముతో పాతిబెట్టబడిన బాలిక,

9. నీవు ఏ పాపమువల్ల చంపబడితివని అడుగ బడునో,

10. మరియు ఎపుడు కర్మ పత్రములు తెరువబడునో,

11. ఎపుడు ఆకాశము యొక్క పైతొడుగు తొలగించబడునో,

12. మరి ఎపుడు నరకాగ్ని రగుల్చబడునో,

13. మరియు ఎపుడు స్వర్గము సమీపమునకు తేబడునో.

14. అపుడు ప్రతి జీవియు తాను చేసినది తెలుసుకొనగలడు.

81-1-14

# 88. స్వర్గ, నరకములు మొదలగు వాని వ్యవస్థ

## 389. సంకెళ్ళు, దండలు మరియు దహించుచున్న అగ్ని

1. మేము శ్రద్ధాహీనుల కొరకు గొలుసులు, దండలు మరియు ధగ ధగ మండుచున్న అగ్నిని సిద్ధపరచి యుంచితిమి. 76-4

## 390. చెవి, చర్మ చక్షువుల సాక్ష్యము

1. ఈశ్వర విరోధులు నరకాగ్ని చెంత గుమికూర్చబడు దినమందు, వారిని గుంపులుగా చేసి ఉంచుదురు.
2. వారు అగ్ని కడకు రాగానే వారి చెవులు, చర్మచక్షువులు వారికి విరుద్ధముగా వారు చేసిన పనులకు సాక్ష్యమివ్వ గలవు.
3. అపుడు ఆ ప్రజలు తమ చర్మములతో " మాకు విరుద్ధముగా ఎందుకు సాక్ష్య మిచ్చితిరి " అన్నచో "ప్రతి వస్తువునకు హక్కు ఇచ్చిన ఈశ్వరుడే మా నుంచి పలికించెను." అతడే మిమ్మలను మొదటిసారి పుట్టించెను. మరియు అతనివైపే మీరు తిరిగి పోవు చున్నారని, ఉత్తర మివ్వగలవు.
4. ఇది గాక మీరు పాపములను చేయుచూ వానిని దాచి యుంచితిరి. మీ చెవులు, చర్మ చక్షువులు మీకు విరుద్ధముగా సాక్ష్యమివ్వ గలవను తలంపుతో గాక, ఈశ్వరునికి మీ క్రియాకలాపములు తెలియుట బేదనుకల్పనలో నుంటిరి. 41-19-23

## 391. పుణ్యాత్ముల స్థానము

1. మేము భూమి మీద గొప్పవారుగా కాగోరని వారికిని, మరియు కలహించని వారికిని పరలోక నివాసము ప్రత్యేకించితిమి. ఈశ్వరపరాయణులకు సద్గతి కలుగును. 28-83

## 392. పాలు తియ్యన, నీరు తియ్యన

1. ఈశ్వర పరాయణులకు వాగ్దాన మొనర్చి స్వర్గములో నిర్మలములై రుచి చెడని జల ప్రవాహములుండును. సదా సుస్వాదువులుగా నుండు పాలనదులు ప్రవహించు చుండును. రుచికరములగు మధుర పానీయములును, శుద్ధమైన తేనె నదులును ఉండును. ఇంకనూ ఈశ్వర పరాయణుల కొరకు అచట రకరకములగు ఫలము లున్నవి. మరియు వారి ప్రభువు వైపునుంచి క్షమ లభించుచుండును. 47-15

## 393. ఉన్నత స్థానము

1. మరియు ఆస్వర్గ, నరకముల మధ్య ఒక సరిహద్దు రేఖ గలదు. అచట ఎత్తైన స్థానము మీద కొందరు వ్యక్తులుందురు. వారు ప్రతి ఒకరిని, వారికిగల గుర్తులనుబట్టి తెలుసుకొందురు. మరియు స్వర్గమునకు పోవు వారిని పిలచి మీకు సలాము (శాంతి యగు గాక!) యని చెప్పుదురు. అయితే ఇట్టి వారు ఇంకనూ స్వర్గములో ప్రవేశించలేదు. అట్టి ప్రవేశానికి వారు అభ్యర్థులు మాత్రమే అయి ఉన్నారు.

2. మరియు వారి దృష్టి నరకమునకు పోవు వారివైపు తిరిగినపుడు ఓ ప్రభూ! మమ్ములను ఈ పాపాత్ములలో చేర్చకుము. అని చెప్పెదరు. 7-46-47

## 394. ఇచ్ఛా + శ్రద్ధ + ప్రయత్నము సఫలత

1. పరలోకమును కోరి, (దానికొరకు) చేయదగిన ప్రయత్నము చేయుచూ, శ్రద్ధావంతు డగుచో, అట్టి ప్రతివాని కృషి సఫలము కాగలదు. 17-19

## 395. కుడి, ఎడమ మరియు దగ్గరి వారలు

1. మీరు మూడు తరగతులలో ఉండిపోగలరు.
2. కుడివారు కుడిభాగమందున్న వారు ఎంత మంచివారు.
3. ఎడమ వారు ఎడమ భాగమందున్నవారు ఎంత చెడ్డవారు.
4. మరియు ముందుకు వెడలిపోవు వారు, అందరికన్న అగ్రగాములు.
5. వారే సన్నిహితులు (సమీపస్థులు) 56_7_11

## 396. అంతములో మధురమా ? ఆదిలో మధురమా ?

1. ఓ మానవుడా ! నీ ప్రభువు సన్నిధికి చేరుటకు నీవు శ్రమ చేయ వలసి యున్నది. బాగా పరిశ్రమ చేయుము. అపుడే నీవు అతనిని కలుసుకో గలవు.
2. అయితే ఎవరి కర్మపత్రము వారి కుడిచేతి యందుంచబడునో,
3. వారితో లెక్క గైకొనబడును. అది తేలిక యగు గణితము.
4. ఇట్టివాడు తన వారలవైపు ఆనందితుడై తిరిగి రాగలడు.
5. కాని, ఎవరికి వీపు వెనుక భాగము నుంచి కర్మపత్రము ఇవ్వ బడునో,
6. అతడు మృత్యువు, మృత్యువు అని అరచును.
7. మరియు అతడు నరకాగ్నిలో ప్రవేశించును
8. నిస్సందేహముగా అతడు తన సంతానములో సంతోషపడియుండెను.
9. మరియు అతడు ఎప్పటికిని తిరిగి రానను కల్పనలో నుండును.

### 397. ఈశ్వరేచ్ఛ ఉన్నంతవరకు

1. అభాగ్యులగువారు అగ్నిలో నుందురు. అచ్చట వారు మొత్తు కొందురు. మోదుకుంటూ రోదనము చేసెదరు.

2. నీ ప్రభువు తలచితేనే తప్ప వారు భూమ్యాకాశము లుండు వరకు అచ్చట ఉందురు. నీ ప్రభువు ఇష్టమున్నట్లు చేసి వేయగలడు.

3. భాగ్యవంతులగు వారు స్వర్గములో నివసింతురు ఈశ్వరేచ్ఛ మినహా భూమ్యాకాశము లుండువరకు వారచ్చట ఉండ గలరు, ఇది అవ్యయమగు వరదానము. 11-106-108

## 89. శాంతి మంత్రము

### 398. శాంత జీవుడు

1. ఓ శాంత జీవుడా!

2. తిరిగి మన ప్రభువువైపు వెళ్ళుము. అతడు నీకు ప్రసన్నుడు, మరియు నీవు అతనికి సంతుష్టుడవు.

3 అందువల్ల నా దాసకోటిలో చేరి పొమ్ము.

4. మరియు నా స్వర్గములో ప్రవేశించుము. 89-27-30

## 90. ఈశ్వరానుగ్రహము

### 399. ఈశ్వర ప్రసన్నతయే అగ్రగణ్యము

1. ఈశ్వరుడు. శ్రద్ధావంతులు మరియు శ్రద్ధావతులకు స్వర్గోద్యాన ముల వాగ్దాన మొనరించెను వారు ఆ ఉద్యానములతో సదా

నివసించెదరు. అచట పరిశుద్ధములగు గృహము లుండునను వాగ్దానము గలదు అన్నిటికన్న మిన్న అచట లభించేది ఈశ్వర ప్రసన్నత. ఇదే గొప్ప సఫలత. 

## 400. స్వర్గముకన్న నాచెంతగలది అధికము

1. ఈశ్వరుని పట్ల తమ కర్తవ్యమును రూఢిగా నిర్వహించు వారి చెంతకు స్వర్గము తేబడును. అది దూరముగా నుండదు.

2. సావధానులై ఆజ్ఞ పాలించు వారికొరకును, పశ్చాత్తాపము నొందు వారి కొరకును, వాగ్దానము చేయబడిన స్వర్గము ఇదేనని చెప్పబడును.



3, పరమ కృపాలుని చూడకున్నను, వెరచు వారును, ఈశ్వర పరాయణ హృదయముతో వచ్చు వారును,

4. ప్రశాంతముగా ఆ స్వర్గములో చేరుదురు.



5. అచట వారు కోరునదంతయూ లభించును. అంతకన్న మా చెంత అధికముగా గలదు. 50-31-35

—: సమాప్తము :—